సెక్స్‌సైకాలజీ

# కామప్రవృత్తి

హేవలాక్ ఎల్లిస్ ని
అనుసరించి

రాంషా & శరీ

ధర్మచక్ర పవర్ ప్రెస్
సామర్లకోట 533 440

# విషయ సూచిక

## సిగ్గు

## ఎద

# సిగ్గు

సిగ్గు స్త్రీ పురుషులిద్దరిలోనూ ఉంటుంది. ఉన్నా పురుషులలో కన్నా స్త్రీలలోనే ఎక్కువ గనుక స్త్రీలకే ప్రత్యేక లక్షణంగా అలంకారమవుతుంది. ఈ సిగ్గు ఎక్కువగా కామాంగాలను అంటిపెట్టుకు ఉంటుంది. అందుకే వాటిని దాచుకునే ప్రయత్నాన్ని ఉభయులూ చేస్తారు. కనుక సిగ్గును కూడా ఒకరకం భయంగానే చెప్పవలసి వుంటుంది. యీ భయం ఆ వ్యక్తికి స్వతహాగా కలిగేదే అవుతుంది.

సిగ్గు అనబడే ఈ రకం భయంలేని స్త్రీలన్నా కామాంగాలను మర్మంగా ఉంచుకోవటం తెలియని స్త్రీలన్నా పురుషులకంత ఆకర్షణ ఉండదు. కనుక వాటిని దాచి పురుషునిలో ఆకర్షణను పెంపొందించాలి.

పురుషులలో నిర్భీతి, నిస్సిగ్గు, ఎక్కువ. అది ఆధునిక యుగంలో పురుషత్వానికే చిహ్నమౌతుంది. అంతేగాని తప్పు, అవమానమూ కావు. అవునా! ఆ నిస్సిగ్గు, ఆ నిర్భీతి స్త్రీలలో ఉన్నట్లయితే ఆ స్త్రీలకు స్త్రీత్వమే కొరవడిందని చెబుతున్నారు. కనుక నేడు తమ మర్మాంగాలకు ఆ పురుషునివల్ల ప్రమాదం వాటిలనున్నట్టుగా నటించే భయాన్నే "సిగ్గు"గా యెంచి దానిని స్త్రీలకు భూషణంగా భావించి తద్వారా పురుషుల్ని ఆకర్షించుకోదగ్గ సాధనంగా నేటి వారు పేర్కొంటున్నారు. నేడు సిగ్గుపడేవాడు పురుషుడేకాదు.

స్త్రీ పురుషుల లైంగిక జీవితంలో ఇంత ప్రాధాన్యత వహించిన సిగ్గు గురించి యింక చర్చించుకుందాము.

## సిగ్గు ప్రశస్తి

పురుషులలో కామోద్రేకాన్ని బాగా రెచ్చగొట్టటానికే స్త్రీల సిగ్గు

ఉద్దేశింపబడింది. ఇది మన దేశంలో మాట; అలాంటి సిగ్గును ఆడవాళ్ళు చూపించకపోతే పురుషులలో కామమే జనించదు.

స్విట్జర్లాండులో బెన్నగరానికి ఒక యాత్రికుడు వెళ్ళాడు. ఆదేశాచారం ప్రకారం మగవాళ్ళు స్నానానికి వెళ్ళేటప్పుడు వొళ్ళు తోమటానికి స్త్రీ నౌకరు వస్తుంది. ఈ యాత్రికుడు తనకు సేవచేయడానికి పద్ధెనిమిది యేళ్ళ పిల్లను ఎన్నుకొన్నాడు. వాళ్ళ దేశాచారం ప్రకారం ఆ పిల్ల స్నానాలగదిలోకిచ్చి ముందుగా అతను చుట్టుకున్న తువ్వాలు విప్పి పారేసింది. ఆ తరువాత తన గౌను కూడా విప్పేసి అతనికి వళ్ళంతా సబ్బు పెట్టి తోమి నీళ్ళుపోసింది. యిదంతా పెదవన్నా కదపకుండా సీరియస్‌గా జరిగిపోయింది. అతని వొళ్ళు తుడిచి లేచిన తరువాత అతని శరీర సౌందర్యానికి ముగ్ధురాలై వివశయ్యై అనురాగ సంబంధాన్ని కాంక్షించింది. కాని ఆ యాత్రికునిలో యే విధమైన మన్మధవికారమూ కలగలేదట! స్త్రీలకు సిగ్గే అలంకారంగా గల దేశం నుంచే ఆయన వచ్చేడు. బొత్తిగా మగవాడిలా నిస్సిగ్గుగా దెసమొసలతో ఆమె తన ముందు నిలబడేసరికి తాను సిగ్గుపడ్డాడు. అతనిలో పురుషత్వం మేల్కోలేదు. "ఆ పిల్ల అందాన్ని కళ్ళారా చూడలేకపోయాను; సిగ్గు నన్ను ముంచెత్తుకొచ్చింది. అయినా ఆమె ముఖంలో తొణికిసలాడే అందాన్ని కళ్ళల్లో మెరిసే కాంతుల్ని ముద్దువచ్చే పెదాలినీ, ముత్యాలవంటి పలు వరసనీ నవనవలాడే శరీర సౌష్టవాన్నీ, ఉన్నతపయోదాలనూ వార చూపు లతో గ్రహించేవున్నాను. ఆమె అరిచేతులు మాత్రం ఇంకొంచెం మెత్తగా ఉంటే బాగుండుననిపించింది. కష్టపడి పనిచేయటంవలన, పాపం ఆమె అరచేతులు మొద్దుబారి ఉంటాయి.... అయినా పద్ధెనిమిదేళ్ళ పడుచు నాకోసం ఆశతో నా ముందు నించుంటే సిగ్గుపడి బైటకొచ్చేశాను. ఎందుకని?" (కేశనోవా)

ప్రేమ ఆధునిక నాగరికత సంపాదించుకున్న అమృతం. కాని అడవి జాతులలోను, వ్యవసాయ జాతుల్లోనూ ప్రేమలేదు. అడవి మనుష్యులకు కామం కేవలం సహజప్రవృత్తే. పశువులకు మల్లేవాళ్ళూ "ఎద"

వచ్చినప్పుడే కలిసేవారు. ఎక్కువగా స్త్రీలకు ఋతుకాలంలోనే (అండ విసర్జన అయ్యేసమయం) విచిత్రమైన మదపువాసన వెలుపడుతుంది. దాని వలన పురుషుడు ఉద్రిక్తుడై స్త్రీని కలిసేవాడు. వ్యవసాయ జాతుల నాటికి సాత్విక కామం, శృంగారం క్రింద మారింది. భిన్న రతభంగిమలను ప్రదర్శించుకుంటూ సంతృప్తి పొందటమే వారికి అభిమతమైంది. ప్రేమ పూర్తిగా అవతరించింది. ఆధునిక నాగరికతల్లో ఇక్కడ ఊహకు ప్రాధాన్యత ఎక్కువైంది.

ఆటవిక దశలో కేవలం సంతానం కోసమే కలయిక ఏర్పడితే వ్యవసాయదశలో శరీరదాహ సంతృప్తికోసం ఏర్పడవలసి వచ్చింది.

ఇదే రకం పరిణామం సిగ్గు విషయంలో కనిపిస్తుంది.

సాధువులైన పక్షిజాతులు ముఖ్యంగా ఏ దొఱువులోనో మంచినీళ్ళు త్రాగేటప్పుడు సాధ్యమైనంతవరకూ మరుగుకు చేరుకుంటాయి. డేగలో లేక అలాంటి క్ర్యూరపక్షులేవైనా తాము నీళ్ళల్లో తల ముంచివున్న సమయంలో వచ్చి తన్నుకుపోతాయేమోనన్న భయం వాటికి. చీమచిటుక్కుమంటే అవి తృళ్ళిపడతాయి. సిగ్గు అనాది స్వరూపమే ఈ తృళ్ళిపాటని మా అభిప్రాయం.

అలాగే చరిత్రకందనికాలంలో స్త్రీలు అధినేతలుగా కుటుంబాన్ని నడిపించుకునే మాతృపరవ్యవస్థలో అనావృతలై(వంటిపై బట్టలు లేనివారై) స్వతంత్రంగా స్వపరభేదం లేకుండా పురుషులతో సంబంధాలను కలిగి వుండేవారు. ఆ రోజులలో యేసది వొడ్డునో, యే పొదల పొంతనో ఋతుమతి అయిన స్త్రీ కనిపించినప్పుడు పురుషుడు ఆశ్రయించడం జరిగేది. లేదా ఒకనితో సంప్రయోగిస్తున్న సమయంలో మరొకడు చూచి ఉద్రిక్తుడు కావడం జరిగేది; అలాంటి సమయాలలో పశువులు తోక ముడిచినట్టే, నగ్నంగా కనిపించిన స్త్రీలు ఆకస్మిక పురుష దర్శనానికి సిగ్గుపడి చేతులతో మర్మాంగాలను కప్పుకోవటం చూస్తాము. ఇక్కడ సిగ్గుకి భయమే స్థాయీభావం. ఎక్కడ ఎవరికంట పడటం వలన తమ మర్మాంగాలకు

ప్రమాదం ఏర్పడుతుందోనని వారు భయపడుతూ ఉంటారు.

క్రమంగా సిగ్గే స్త్రీకి భూషణమయింది. సిగ్గులేని ఆడదాన్ని చీత్కరించు కోవటం పరిపాటి అయింది. పురుషుల్ని ఆకర్షించటానికి తగ్గ ఆయుధంగా బానిస వ్యవస్థలో స్త్రీ సిగ్గును వాడుకుంది. పెళ్ళికూతుళ్ళు సిగ్గులొలకపోస్తూ ఊహల్లో రాసున్న పెళ్లికొడుకులు చేయబోయే చర్యలన్నిటినీ ప్రతిష్ఠించుకొంటూ గాలిమేడలు కట్టుకునేవారు. ప్రతీ స్త్రీకి తాను సిగ్గుపడే అంగాలు యేర్పడ్డాయి. పురుషులు స్త్రీలయే అంగాలను చూచి మురిసిపోతున్నారో వాటిని చూచుకొని స్త్రీలు సిగ్గుపడటం నేర్చారు. దానితో సిగ్గు అంగాధీనం అయిపోయింది. తాను సిగ్గు పడవలసిన దానిని పదిమందిలోనూ వెల్లడి చేయడం కంటే స్త్రీకి మరణసమానమైన బాధ వేరొకటి లేకపోయింది. చివరికి సిగ్గే మానానికిపర్యాయపదమైపోయింది. "సిగ్గూ, లజ్జా, లేకుండా మానాభిమానాలు లేకుండా" మగవాడి యెదుట పడటమంటేనే ఆడదానికి చచ్చే చావయింది. అంత జాగ్రత్తగా దాచుకొన్న ఆమె మానాభిమానాలకు గిలిగింతలు కలిగేలా ఆమె ప్రియుడు యే చిన్న తమాషాచేసినా ఆమె పరవశించేది. కాని ఆమె సును సిగ్గు దొంతరల అందాన్ని హర్షించలేక ఏ మాత్రం మోటు గా ప్రవర్తించినా ఆమె అహం దెబ్బతినేది. పెద్ద అంతస్తులో వున్న స్త్రీకి "ముఖావం" వల్ల గౌరవం కలుగుతుంది. అలాంటి ఆమెకు అతను తగిన భర్తకాడని అర్థం (కాళిదాసు చరిత్ర ఇదేకదా). అవును; ఎలా అవుతాడు?

ఏ స్త్రీగాని తన భర్తకు తానేదో దాచి వుంచి బహూకరిస్తున్నంత ఆనందం పొందుతుంది. అతని వేడికోళ్ళకు తనని తాను బహుమతిగా సమర్పించుకుంటుంది. అది ఆమె మెచ్చుకోలుకు చిహ్నం.

దాంపత్యం వల్ల ఆమెకు కలిగిన ఆనందం ఆమెత్యాగం ముందుచాలా అల్పంగా కనిపిస్తుంది. తన మానధనాన్ని ఆమె అర్పించలేదా? యెంతకాలం యెంత జాగ్రత్తగా దాచుకుందోమరి!

'తేనెపట్టును కొల్లగొట్టిన దురాత్ముడిలా మోట సరసం చేసినభర్తను

చూసి స్త్రీ హృదయం ఘూర్ణిల్లుతుంది. అలా అలా ఆమెకు తెలియకుండా ఆమె శీలాన్ని అపహరించాలి. అయినా ఆమె సమస్త సంపదా పోయినట్లే బాధపడుతుంది.'

(స్టైండాల్)

'స్త్రీలకు సిగ్గు ఒక విధంగా మానసిక నిరోధమవుతున్నది. 'భయం' ఆదుర్దా, కుతూహలం ఆశ మొదలైనవన్నీ కలసి ఏకమై స్త్రీల ప్రేమకు మేలిముసుగుగా అవతరించాయి. దంపతుల మధ్య ఈ సిగ్గు ఉన్నంతకాలం వారి ప్రణయంలో ప్రతీ ప్రయత్నమూ హృదయరంజకంగా ఉంటుంది.'

(అడ్లర్)

'అయితే చిత్రమేమంటే స్త్రీ కామ సంతృప్తి పొందగానే సిగ్గుకూడా చల్లారిపోతుంది. ఆటవిక స్త్రీలనుంచి ఆధునిక స్త్రీల దాకా ఈ విషయం సత్యం. కామం హెచ్చుతున్నకొద్దీ ఆడవాళ్ళకి సిగ్గు ఎక్కువవుతుంది. సిగ్గే కామానికి భౌతిక చిహ్నమని చెప్పుకోవచ్చు.'

(వెంటూరి)

స్త్రీల సిగ్గులో ఆటుపోటులుంటాయి, పురుషులకు హుందా ఉంటుంది. పురుషుల హుందాతనం (డిగ్నిటీ ) జీవితమంతా ఒక్కలా ఉంటుంది.

మరో విచిత్రమేమిటంటే కన్య తన ఈడు యువకునికన్నా ఎక్కువ సిగ్గు పడుతుంది. కామానుభవంగల తరుణి మాత్రం తన భర్తకన్నాతక్కువ సిగ్గుపడుతుంది. ఇక ఆమె పిల్లలతల్లి అయినట్లయితే కన్నెపిల్లలా సిగ్గు పడటాన్ని అందరూ అపహసిస్తారు.

ఋతుకాలం దాటిపోయిన తరువాత కొన్ని పక్షులు తమ పింఛాన్ని పోగొట్టుకున్నట్టే వయస్సు మళ్ళిన స్త్రీలు తమ సిగ్గును పోగొట్టుకోవాలి. అలా పోగొట్టుకోని స్త్రీలను పోకిరీ వాళ్ళుగానే భావిస్తాము. ఎందుచేత? స్త్రీల జీవితంలో సిగ్గుకీ ప్రణయానికి ప్రత్యక్ష సంబంధం ఉంది.

మదాం రిసూజ్ పెద్ద తిరుగుబాటు ఉద్యమాన్ని నడిపిన మహిళ; ఆమె పురుషుల కామ మనస్తత్వాన్ని గురించి దాని తారతమ్యాన్ని గురించి వ్రాస్తూ సిగ్గుకేవలం స్త్రీ లక్షణం కాదని వాదించింది. పురుషుడు తన అవమానాన్ని స్త్రీల కంటగట్టాడు. దానికి ప్రధానంగా రెండు కారణాలు ఉన్నాయి. మొదటిది తనకూ, స్త్రీకీ సమానధర్మాలే ఉన్నవని పురుషుడు విశ్వసించటం. రెండవది; మానవ పరిణామం కామ మనస్తత్వాన్ని పూర్తిగా మార్చివేసినందువలన పురుషుని మానసిక దౌర్బల్యాన్ని స్త్రీకి ఆరోపించటం జరిగింది. సంఘానికి స్త్రీ లొంగి ఉండాలన్న పేర సాంప్రదాయపు టబద్ధాలలో స్త్రీని వంచించారు. పురుషుడు తన అధికారాన్నిబలపరచుకోవటం కోసమే స్త్రీకి సిగ్గు విలువను కల్పించి తద్వారా పరోక్షంగా పెత్తనం సాధించటంనేర్చాడు. యీనాటి పురుషులు వేరే స్త్రీ నణచి వేయనక్కరలేకుండానే సాంప్రదాయం పేర యీసిగ్గే వారి నణచివేస్తుంది.యిది నిజంగా స్త్రీలకు తీరని అన్యాయం. అయినా ఈ మనస్తత్వ ధర్మాన్ని స్వీకరించేందుకు స్త్రీజాతి పుట్టుకనుంచి తిరస్కరిస్తూనే వుంది. అనాది స్త్రీ తన స్త్రీత్వాన్ని చూసుకొని గర్వించేదేగాని ఆధునిక స్త్రీ వలె ఆడజన్మ హీనమనుకొని కుమిలిపోయేదికాదు. ఒక పట్టాన తన నగ్న శరీరానికి ఆచ్ఛాదన ధరించడానికి అంగీకరించేదికాదు. నేటి ప్రతీ బాలికా పుట్టుకనుంచీ, యవ్వనం ప్రవేశించి నప్పటినుంచీ తన జన్మ సార్ధకమనే అనుకొంటుంది. నైతికంగా తాను మగవానికన్నా వున్నతురాలనను కొంటుంది. అంత గొప్పదైన తాను గొప్పతనానికికారణమైన ఆ లింగ భేదాన్ని ఎందుకు కప్పివుంచాలో అర్ధంకాక ఆశ్చర్య పోతుంది. ఒక వంక ప్రకృతి రెండోవంక నాగరికత ప్రభావం వత్తిడి చేస్తుంటే రెండింటి లో దేని నెన్నుకోవాలో, తెలియక ఆమె తడబడుతూ ఉంటుంది.

స్త్రీల నగ్నత్వంలోనే సౌందర్యం యిమిడి వున్నదన్న భావంఅనాది కాలం నుంచీ ఉంది. అందమే వారి జీవితానికి పరమావధి; నేటికీ ఏ చిత్ర కారుడైనా స్త్రీలను నగ్నంగా చిత్రించటంలోనే తన కళ సార్ధకమైనదను

కంటున్నాడు. అనాగరిక దేశాలలో మిషనరీలు ప్రవేశించి అక్కడ ఆడవాళ్ల చేత బట్టలు కట్టించటానికి తల ప్రాణం తోకకు వచ్చేదట! బట్ట కట్టు బాటుకు ఆడవాళ్ళు ఒహపట్టాన వప్పుకునేవారు కాదు. యిప్పటికీ సొగసుగా పమిటలు వొత్తిగించటంలోనూ, ఎత్తి పట్టించటంలోనూ అందాన్ని ప్రదర్శించగలమని వారి అభిప్రాయం. ఒక రకంగా ఇది పురుషులు తమపై విధించిన శిక్షకు తిరుగుబాటు! అంటూ ఆమె వ్రాసింది.

ఈ వాదంలో పూర్తిగా సత్యంలేకపోయినా బొత్తిగా కొట్టిపారెయ్యవల సినది కాదు. నగ్న స్త్రీలు నిస్సిగ్గుగా తిరిగేవారనటం మాత్రమే నిజంకాదు. వారికీ ఒక విధమైన సిగ్గున్నట్లుగా అనాదిజాతుల జీవితం చెపుతున్నది.

అయినప్పటికీ సిగ్గుపడటమన్నది స్త్రీకి జన్మతః వచ్చిందికాదు. ఉగ్గుపాలతో నేర్పితే వచ్చిందే. చిన్నతనం నుంచీ ఎలా సిగ్గుపడాలో ఆడ పిల్ల నేర్చుకుంటుంది. క్రమంగా సిగ్గు ఆమెకు అలవాటైపోతుంది. స్వత హాగా మగపిల్లల్ని కూడా కొందరు చిన్నప్పుడు ఆడపిల్లల్లా తయారుచేసి పెంచుతారు. అలా పెరిగిన మగపిల్లలలో ఈ ఆడారిసిగ్గు అపరిమితంగా కనిపిస్తుంది. తర్వాత తాము మగవాళ్ల మని గ్రహించాక వాళ్ళలోంచి ఇట్టేపోతుంది. చురుకుగా ధైర్యంగా మగవాళ్ళయి ముందుకు వస్తారు.

స్త్రీలలో చిన్నతనంలో ఈ సిగ్గు సహజంగా ఉంటుంది. బాగా పెద్ద వాళ్ళయ్యాక అలవాటుగా ఉండిపోతుంది. అందుకే కూర్చున్నవాళ్ళులేవ టం తలుపు చాటున దాక్కోవటం వంటి చర్యల్లో సహజత్వం కనిపించదు.

మొత్తం మీద ఈ సిద్ధాంతాలన్నీ పరస్పర విరుద్ధంగా వున్నాయనీ వాటి కన్నిటికి సమన్వయం చెప్పడం కష్టమని ఒప్పుకోక తప్పదు. కొన్ని పరిస్థితులలో స్త్రీలు సిగ్గును ఎందుచేత విపరీతంగా ప్రదర్శిస్తారో,మరికొన్ని పరిస్థితులలో బొత్తిగా సిగ్గు విడిచి యెందుకు ప్రవర్తిస్తారో చెప్పటం కష్టమవుతున్నది.

మగడాక్టర్లకు పరీక్ష నిమిత్తం తన శరీరాన్ని నగ్నంగా అప్పగించినంత తేలికగా పురుషుడు స్త్రీ డాక్టరుకు అప్పగించలేడు. యింతకన్నా ఏమి

ఉదాహరణ కావాలి?

అవసరమైతే కట్టుకోవటానికి, అక్కరలేకపోతే పారెయ్యటానికి సిగ్గు కూడా రవికలాంటి కృత్రిమ వస్తువు కాదు. నత్తగుల్లలా ఒక్కొక్కసారి యెంత ప్రయత్నించినా తెరుచుకోదు. యింకొక్కప్పుడు దాని కదే తెరచుకొని మూపురంలా గోపురంలా అలంకార మవుతుంది. పురుషుడి సిగ్గు అలాంటికాదు. సమయానుకూలంగా సద్దుబాటయ్యే గుణం దానికి లేదు. యేదో ఒక అంతుకు పోకుండా వుండగలిగే శక్తి దానికిలేదు. స్త్రీ మౌనంవహించి నప్పుడు సహింపలేక చిరాకు పడటమూ, ఆమె సిగ్గువిడిచి తలపడితే భరించలేక ఏడవటమూ సామాన్య పురుష పద్ధతి. అందుకే స్త్రీ మనస్తత్వం గ్రహించి దాన్ని ఆనందపరిచేటట్టు ప్రవర్తించేలా పురుషులకు శిక్షణ ఇప్పించటం అవసరం.

**నమ్రత**, సిగ్గు, భయం, రెచ్చగొట్టే గుణం వంటివన్నీ కలిసి కలగా పులగమైపోయి స్త్రీకి అలంకారమయ్యాయి, కనుక ఏది ఏదో, ఏది ఎంత వరకూ మంచిదో విడమరిచి గ్రహించే సావకాశం ఇందులో కనిపించదు. అయినప్పటికీ నమ్రతవల్లనైతేనేమి, సిగ్గువల్లనైతేనేమి, లేదా పరిణామం వల్లనైతేనేమి కాలక్రమేణా కామావేశం సంస్కరింపడి ఉదాత్త రుపాన్నందు కొన్నది. నాగరికత రూపమైన సిగ్గు అనురాగానందాలను పెంచటానికే సహాకరిస్తుంది.

మరొక సంగతి ఉంది. మతంలోగాని లలితకళలలోగాని, జీవి తంలోగాని ఉదాత్తమైన భావాలన్నీ కామం చేతనే ఉదాత్తతను పొందాయని. చెప్పవలసి ఉంది. మానవుని కష్టాలను అనుభవించిన దేవతలకే ఎక్కువ పరిగణన వచ్చినట్టు, మానవులు ఆశ్రయించిన కామానుభూతులకే శిల్పాలలో ప్రాధాన్యత వచ్చింది. స్త్రీ పురుషుల కలయికకు భిన్నమైన లలిత కళలే లేవు.

తొలు దొల్త స్త్రీ తన కామాంగాలలో కలిగే ఆనందానుభూతుల్ని పరి గణించక పోయి ఉండవచ్చును. అందుకే ఆడజంతువుల అనురాగాన్ని

సంపాదించటానికే మగజంతువులు యెన్నో అవస్థలు పడ్డట్టే పురుషులు కూడా ప్రణయకలాపాలు జరపవలసి వస్తున్నోంది. అలాగే ఇతర ... కు పక్ష్యాదులు కూడా శరీరంలోని కొన్ని అంగాలను కప్పి వుంచటం అందమని పించి ఉంటుంది. అటవికులు ఆడే కొన్ని ఆటలు, ధరించే ఉడుపులూ, చూపించే భంగిమలు కామానుభవానికి సంబంధించినవే. ఈ విధంగా మతంలోనూ మానవ సంస్కృతిలోనూ ప్రధాన విషయాలుగా మౌనం, దాపరికం, నిగ్రహం తయారయ్యాయి.

పక్షిజాతుల్లో ఆడదాని మౌనాన్ని లేదా ముభావాన్ని పోగొట్టటం కోసం మగపక్షి పాడుతుంది. పురివిప్పి ఆడుతుంది. ఆనందాన్ని, సామర్థ్యాన్ని ప్రదర్శిస్తుంది. మనుష్యులు కూడా యింతే. పురుషులు తమలోని ప్రేమిం చదగ్గ అర్హతలను ప్రదర్శించకపోతే స్త్రీల మనస్సు కరగదు. అందుకే యీ శిల్పాలు, చిత్రలేఖనాలు, నృత్యాలు, కవిత్వాలు అవసర మయ్యాయి. (స్టేన్లేహాల్)

జీవశాస్త్రజ్ఞులు వస్త్రధారణ గురించి, అలంకరణ గురించి, కామం గురించీ, చికాకు గురించీ పరిశోధనలు జరిపి ఎన్నో అమూల్య విషయాలను వెల్లడించారు. కాని మనస్తత్వ శాస్త్రజ్ఞులు మాత్రం ఈ విషయాలను పట్టించుకున్నట్టు లేదు. కనీసం ఎత్నోగ్రఫిస్టులైనా (ఎత్నోగ్రఫీ ప్రపంచంలో జాతుల తేడాల గురించీ, వారి ఆచార వ్యవహారాల గురించీ, వారి మత ధర్మాల గురించీ వివరించే శాస్త్రం. ఆ శాస్త్రజ్ఞుల్ని ఎత్నోగ్రఫీస్టులంటారు) పరిశోధించవలసింది. వారుస్నూ అలా చెయ్యలేదు. ఇక ఎవరైనా అడపా దడపా వ్రాసినప్పటికీ వాటిల్లో సబబూ సందర్భమూ కనిపించడం లేదు.

బట్టలు ధరించటం నేర్చినందునే సిగ్గుపడటం జరిగిందని చాలా మంది మనస్తత్వ వేత్తల అభిప్రాయం. ఈ అభిప్రాయం శుద్ధ తప్పని రుజువైపోయింది. బట్టలు కట్టటం నేర్చక పూర్వమే మనుష్యజాతిలో సిగ్గు విపరీతంగా వుండేది. కనుక సిగ్గుకీ, బట్టల ధారణకీ సంబంధం

ఉన్నదనుకోకూడదు.

సిగ్గుకూడా ఒక విధంగా అవమానమే. సిగ్గుపడే మనిషి మనస్తత్వంలో ఏదో లోపం ఉన్నట్లే లెక్క. సిగ్గుపడ్డప్పుడు తలదించుకోవటం, కళ్లల్లోకి కళ్ళుపెట్టి చూడకపోవటం జరుగుతాయి. ఆ సమయంలో మనస్సంతా కృంగిపోతుంది. యేదో అపరాధం చేసినట్లు గుండెలు కొట్టుకుంటాయి. అయినా ఇది నిజంగా అవమానం కాదు. నిజమైన అవమానంలో, ఆ అవమానం కలగటానికి తగ్గహేతువు మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఇక్కడ అలాంటిదేదీ ఉండదు. మన తప్పేమీ లేకుండానే ఇక్కడ అవమానించే సిగ్గు ఉత్పతిల్లుతుంది.

ఒక యువకుడు ఒక యువతిని ప్రేమించాడనుకోండి. ఆ యువతి తనంత తావచ్చి అతన్ని ప్రేమించానని చెప్పిందనుకోండి. అప్పుడతనికి సిగ్గు వేస్తుంది. అతను ప్రేమించటం వలన అతని దృష్టితో ఆమెకు అతని కన్నా యెంతో ఉన్నత స్థానం వుంది. ఆమె అతన్ని ప్రేమించానని చెప్పటం వలన ఆ స్థానం నుంచి పతనమై అతని స్థానం లోకి వచ్చినట్టు భావిస్తాడు. కనుక అది అతనికి అవమానమవుతుంది.

పెద్దవాళ్ళని తమకు కావలసినదేదైనా అడగటానికి పిల్లలు కూడా యిలాగే అవమాన పడతారు. తమకన్నా ఆ పెద్దవాళ్ళు చాలా పెద్దవాళ్ళుగా కనబడటమే కారణం.

కొత్తవాడెవరైనా సరే మనకన్నా కాస్తడాబుగా కనబడితే అతన్ని పలకరించడానికి మనం సిగ్గుపడతాం. కొత్త మనుష్యులెప్పుడూ మనకన్నా గొప్ప వాళ్ళుగానే కనిపిస్తారు.

**మనల్ని మరొకరితో పోల్చుకుని మనతక్కువ తనాన్ని గ్రహించడం లోనే సిగ్గు పొటమరిస్తుంది.**

**మనస్థాయి మన వ్యక్తిత్వం కన్నా అల్పంగా ఉన్నదనిపించినప్పుడు కూడా మనకు సిగ్గేస్తుంది.** నీచపు ఆలోచనలు, కామవాంఛ మనకు సిగ్గు ను కల్పిస్తాయి. కామ పరమయిన ఆలోచన వలన శరీరంలో కామవికారం

కలిగితే మనకు సిగ్గేస్తుంది. అలా కలక్కపోతే వెయ్యదు.

నమ్రత, సిగ్గు, అవమానం, లజ్జ, చొరవ లేకపోవటం వంటివన్నీ కలగాపులగమై ఉంటాయి. వాటన్నింటినీ విడదీయటం సాధ్యం గానిపని. కేవలం లైంగిక చైతన్యానికి సంబంధించిన భాగాన్ని మట్టుకే సిగ్గు అని చెప్పుకోవటం మంచిది. కనుక సిగ్గు యధార్ధ స్వరూపాన్ని వివరించుకుందాం.

సొలొమన్ దీవులలో నివశించే న్యూజార్జియన్ జాతివారు బొత్తిగా అనాగరికులు. వారికి కుండలు చేసుకోవటంగాని, బట్టలు నేసుకోవటం గాని రాదు. వారు ఆకులలములే కట్టుకుంటారు. అయినా వారు కూడా తమ అంగాన్ని చూడనివ్వరు. కలయిక ఇతరుల కళ్ళపడనివ్వరు.

న్యూహెబ్రైిట్ జాతివారు పురుషాంగాన్ని అతి రహస్యంగా వుంచ ుతారు. మరొకరి కంటబడితే "దిష్టి" తగులుతుందని వారి విశ్వాం. కొన్ని గజాల కాలికోతో పురుషాంగాన్ని 6 అంగుళాల నుండి 24 అంగుళాల పొడవు దాకా చుట్టి ఆ చుట్టను మెడకు వ్రేలాడ కట్టుకుంటారు. కొందరు దానిని అడవి పువ్వులతో అలంకరిస్తారు కూడా. వృషణాలకుయే అచ్ఛా దనా ఉండదు. ఇక వంటి మీద మరెక్కడా బట్ట ఉండదు.

.....సోమర్ విల్లీ

పెలూదీవిలో నున్న ఆదిమవాసుల దేవుడి పేరు "ఇరకాదెరుగకి". ఆయన మానవజాతిని సృష్టించ సంకల్పించి తాను మగవాళ్ళను సృష్టిస్తానని చెప్పి, భార్యను ఆడవాళ్ళను సృష్టించమన్నాడట! యిద్దరూ తమ తమ శిల్పాలను దాదాపు పూర్తిచేసిన తరువాత జననేంద్రియాలను సృష్టిస్తూ వుండగా ఆయనకు తన భార్య యేమి చేస్తుందో చూడాలని బుద్ధి పుట్టిం దట! ఆవిడ సుతలామూ ఒప్పుకోలేదు. చివరికి ఆకులు అడ్డుపెట్టిందట. ఆకారణంగా నేటికీ ఆ జాతి స్త్రీలు ఆకులతో తమ అంగాలను కప్పు కుంటారు. పురుషులు మాత్రం నగ్నంగానే తిరుగుతూ ఉంటారు.

...దాస్టియన్

అయినా ఈ జాతి వారికి సిగ్గు విషయంలో ఎంత పట్టింపు వుందో

ఈ వుదంతం చెపితే తెలుస్తుంది. వొకసారి మేమంతా ఆ అడవిలో కలిసి పోతున్నాము. మాకు ముందు వెదురు డొంకల మధ్యలో చిన్న మురికిగుంట ఉంది. అక్కడికి వచ్చేసరికి మా తైనాతీ ఎంతో భయంతో కేక వేశాడు. ఆవలినుంచి ఒక కన్నెపడుచు గొంతుక వినిపించింది. మాతైనాతీ(ఎస్కార్ట్) ముందుకు వెళ్ళటానికి వీల్లేదన్నాడు. అక్కడిజాతి స్త్రీలు స్నానం చేస్తు న్నారనీ అలా వెళ్ళకూడదనీ అన్నాడు. స్త్రీలే కదా భయం లేదు. పద మన్నాను. స్నానం చేస్తున్న స్త్రీలను పురుషులెవరైనా చూస్తే మరణదండన విధించే హక్కు ఆ స్త్రీలను వున్నదన్నాడు. అందుకే అవి వారికి రహస్య ప్రదేశాలు అయ్యాయి. అని కారల్ సెంపర్ వ్రాశాడు.

న్యూగిన్నీ దేశంలోని స్త్రీలు గోచీలు మాత్రమే పెట్టుకుంటారు. ఎక్కువ మంది అవి కూడా పెట్టుకోరు. అయినా ఎవరన్నా వారికేసి కళ్ళు గుచ్చిచూస్తున్నారను కుంటే సిగ్గుతో మెలికలు తిరిగిపోతారు.

..Vahness

ముఖ్యంగా అరుంటాజాతి స్త్రీలు పూర్తిగా నగ్నంగా వుంటారు. ఆస్ట్రేలియాలో లపచ్యాజాతి స్త్రీలు అయిదు రూపాయల కాయితమంత చర్మపు బిళ్ళను గాని, లోహపు బిళ్ళనుగాని అంగానికి ముందు కట్టు కుంటారు. ఇదే ఆచారం అటవిక భారతీయులలో కూడా ఉండేది. దాని అవశేషమే ఈనాటి మన ఆడపిల్లలకు మొలలో బిళ్ళలు పెట్టడం.

ఈ జాతి పురుషులు నగ్నంగా తిరుగుతారు. వారి జననేంద్రియా లను పరీక్షించ పోతే స్త్రీలను, పిల్లలను ఆమడదూరం తరిమివేస్తేగాని వొప్పుకొనేవారు కాదు. ఫోటో తీస్తాం నగ్నంగా రమ్మని స్త్రీలను కోరితే వారు వొప్పుకొని గోడచాటుకు వెళ్ళి అంగరక్షలు తీసుకుని వచ్చేవారుట.

యిందులో చిత్రమేమిటంటే ఈ అంగరక్షలు తొలగించేటప్పుడు సిగ్గూను ఆ తరువాత నగ్నంగా కెమేరా ముందు నిలబడటానికి వారికి యే సిగ్గూ లేకపోవటమూను -HORN

సౌత్‌సీ దీవుల్లో స్త్రీల పాతివ్రత్యాన్ని గురించి ఫార్‌స్టర్ యిలా

వ్రాశాడు. "ఎంత విపస్త్రిలుగా ఉన్నప్పటికీ ఈ జాతివారు ఇతర వర్ణం వారితో కలియరు. వారిలో వారికి తప్పులేదు; ఒక గోత్రం స్త్రీలందరూ మరోగోత్రం పురుషులందరకీ సమానంగా భార్య అయినప్పటికీ తెల్లవాళ్ళు వాళ్ళకి యెన్నో ఆశగొల్పే వస్తువుల్ని చూపి ఊరించి అడిగితే "లటెర్రాటివ్" (నాకు పెళ్ళయింది) అనేవారు. కాకపోతే "ఎసియా" (వద్దు) అనేవారు. మన మగవాళ్ళుకూడా వింటే సిగ్గుపడేలాంటి మాటలు మాట్లాడినావాళ్ళకి చెడ్డగా అనిపించేదికాదు. నవ్వి గంభీరమైన మౌనముద్ర ధరించేవారు.

17.09 సం॥లో కెప్టెన్‌కూక్ ఆదివారం నాడు ఒక యజ్ఞాన్నిచూశాడు. తహాతీలో జరిగింది. పదహారేళ్ళ యువకుడు పన్నెండేళ్ళ ఆడపిల్లతో సమస్త ప్రజల సమక్షాన మన్మధక్రీడ సలిపాడు. అది తప్పని గాని, అన్యాయమనిగాని ఎవరికి అనిపించలేదు. ఆయజ్ఞానికి పెద్దహోదా లో వున్నా స్త్రీలందరూ హాజరై ఆ పిల్ల ఎలా ప్రవర్తిస్తున్నదో వర్ణించిచెప్పారు.

--యాత్రకథలు

"కూర్పు" కథనం ప్రకారం కామాన్ని, ఆకలిని అందరి కళ్ళముందూ అనుభవించటం వారికి తప్పులేదు. స్త్రీ పురుషులందరూ నేటి తెనుగు పాటకజాతులవలె లైంగిక విషయాలను నిస్సిగ్గుగా మాట్లాడుకునే వారట!

1886 నాటికి నికోబార్ దీవులలో వారు విదేశస్తులు కళ్ళబడి నప్పుడే ఆకులు చుట్టబెట్టుకునేవారు. ఉత్తప్పుడు ఎంతనగ్నంగా తిరిగినా ఫరవాలేదు. గానీ స్నానం చేసేటప్పుడు మాత్రం ఆ స్త్రీలకు సమీపంగా పురుషులు పోకూడదు. అలా పోయినట్లయితే కులపెద్ద శిక్ష విధిస్తాడు.

అండమాను దీవుల్లో కూడా ఆడవాళ్ళు ఆకులే చుట్టుకుంటారు.

బెంగాల్‌లోని గాలోజాతి స్త్రీలు అడుగులోపు గుడ్డపీలికను నడుము కుచుట్టుకొని అంగం మీద కొంత పీలికను వ్రేలాడదీస్తారు. (1872 సం॥) ఆడవాళ్ళు ఇతరుల ఎదుట కూర్చోవలసివస్తే తొడలు రెండూ దగ్గరగా నొక్కుకుకూచుంటే సరిపోతుంది.

అస్సాంలో నాగజాతివారికి వస్త్రధారణ తెలియదు. అయినావారంత

సిగ్గూ నమ్రత మనవారు కూడా చూపించరు. ఇబిన్ మహమ్మద్ కాలీ 1862 -63 లో "అస్సాం విజయ" మన్న గ్రంథంలో నాగజాతి స్త్రీలు రొమ్ములకు మాత్రమే ఆచ్ఛాదనం కలిగి వుండేవారన్నాడు. లింగ భేదం పుట్టుకనుంచీ వుంటుందట! మధ్యనొచ్చేవి రొమ్ములే గనుక వాటికి ఆచ్ఛాదన వుండాలని వారి అభిప్రాయం. పరాయి పురుషులముందు నాగజాతి స్త్రీలు రొమ్ములకడ్డంగా చేతులు కట్టుకుని నిలబడతారు. ఇతర చోట్ల అంగాలకు మాత్రం వారు అడ్డుపెట్టరు.

లంకలో స్త్రీలు తీర్థాలలో స్నానంచేస్తారు. కాని, బట్టలు పూర్తిగావిప్పు కోరు. బట్ట అడుగుభాగాలను కొంచెం కొంచెం తడుపుకొని, ఆ తర్వాతపొడి బట్ట చుట్టబెట్టుకొని తడిబట్ట విడిచేస్తారు. (ఇంగ్లాండులో నౌకరీ పిల్లలకిది ఆచారం) భారతదేశంలో కూడా ఇదే ఆచారం. మలయాలో కూడా ఇంతే. రొమ్ముల్ని మాత్రం ఏ ఆచ్ఛాదనా లేకుండా విడిచి పెట్టేస్తారు. రవికల్ని ఎరుగరు. యోని మాత్రం కనపడనివ్వరు. యోని బయటపడితే దెయ్యం సంప్రయోగం జరుపుతుందనే మూఢవిశ్వాసం వారిలో వుంది.

జపాను స్త్రీలు నగ్నంగా బహిరంగం గానే స్నానం చేస్తారు. అప్పుడు జపాను పురుషులే వాళ్ళ శరీరాల్ని తోముతుంటారు. యూరోపి యన్లు ప్రవేశించిన తరువాతనే వారు సిగ్గు పడటం ప్రారంభించారు. అనగా వీరు అవమానించారని భావం.

జపాను స్త్రీ పురుషులు కలిసి నగ్నంగా స్నానం చేయుటంఅసహ్యం గాదా అని నేను ఒక జపాన్ పెద్దని అడిగాను. ఆయన మీ పాశ్చాత్యులబుర్ర లోనే యీ అసహ్యంగా ఉంది. అంతేగాని మా ప్రవర్తనలో లేదన్నాడు.

(మిట్‌ఫర్డు)

సిగ్గు అనాది కాలానిది. సిగ్గుకూ భయానికీ అవినాభావ సంబంధం ఉంది. నమ్రత కూడా అలాంటిదే. ఈ రెండూ శరీరం మీద అధికారాన్ని చెలాయించే శక్తులే.

ఇవి రెండు రకాలు; మనుష్యులు పుట్టక పూర్వం నుంచీ ఉన్నది

ఒక రకం. ఈ రకాన్ని స్త్రీ జంతువులే సృష్టించాయి. ఇక రెండవది మను ష్యులు సృష్టించినది. ఇది సాంఘికమైనదే గాని లింగ పరమైనది కాదు.

బిడ్డకి ఏ శిక్షణా ఇవ్వకుండా యధాతధంగా పెంచామనుకోండి. ఆ బిడ్డలో తాను ఇతరులకన్న సిరిసంపదల్లో తక్కువదన్న భావం కలగదు. అలాగే లింగపరమైన సిగ్గు కూడా కలగదు. తల వంచుకోవటం, దొంగ చూపులు చూడటం, ఆపక్క ఈపక్క నక్కటం వంటివి ఉండవు. నిర్భయం గా నిస్సిగ్గుగా ముఖమెత్తి మాట్లాడుతుంది. కొన్ని మాట్లాడకూడనివిషయాలు న్నాయన్న సంగతి కూడా దానికి తెలియదు.

బిడ్డల ప్రవర్తననీ, మాటల్నీ బట్టి చూస్తుంటే, పెద్దవాళ్ళు సిగ్గుపడే విషయాలను ఎంత అమాయకంగా పిల్లలు ప్రశ్నించగలరో మనకుఅవగత మవుతుంది. వాళ్ళ చేష్టలు చిత్రంగా ఉంటాయి. అలాంటి వాటిని పెద్ద వాళ్ళు చేయటానికి సిగ్గుపడతారు. పై ఆసామీల కళ్ళముందు చూడటానికి కూడా సిగ్గు పడతాము. ఇంతదేనికి? పిల్లలు గుడ్డ విప్పుకు సుఖంగాతిరగ గలరు. పెద్దవాళ్ళం ఎంచేత తిరగలేము?

నాలుగేళ్ళు వస్తేనేగాని కామాంగాలను కప్పుకోవలసిన అవసరం పిల్లలలో అంకురించిందట! అనగా వాళ్ళల్లో సిగ్గుపడే వయస్సు ఇదేనని అర్థం. ఆ వయస్సులో వంటిపై బట్ట సరిగా ఉండేటట్టు నేర్పకపోతేపిల్లల్ని ముందు ముందు సాకటం కష్టమవుతుంది.

ఇక నాగరిక జాతులు సిగ్గును మరీ ఘోరంగా పాటిస్తాయి. పురుటి స్నానం అయిన పిల్లలకి సైతం గుడ్డలు చుట్టబెట్టటం ప్రారంభిస్తారు.

తొమ్మిదవయేడు వచ్చేసరికి ఆడపిల్లలలో యవ్వనం మొలకెత్తు తుంది. దానితో ఆమెలో సిగ్గు పొటమరిస్తుంది. ఆ వయస్సులో ఆడపిల్లలు చేసేటంత హంగామా మగపిల్లలు చేయరు. అయితే మరో చిత్రం కూడా వుంది. **కామవాంఛ ఎప్పుడైతే మనస్సులో పుడుతుందో అప్పుడే సిగ్గు విధిగా పుడుతుంది.** అయినంత మాత్రాన సిగ్గు కేవలం కామానికి సంబం ధించినదే అనుకోకండి. సాంఘిక సమస్యలు కూడా అందులో ఇమిడి

వున్నాయి. అయినా అన్నిటికన్నా దీనిపై కామప్రభావమే విస్పష్టంగా పడినట్టు చెప్పుకోవాలి.

ఉదాహరణ: ఆడకుక్కని చూడండి! అది "ఎద" లో లేదనుకోండి. అలాంటప్పుడు మగకుక్క ఒకటి ఆశతో తోక ఆడిస్తూ, దాన్ని చుట్టుముట్టి అల్లరి చేస్తుంది. అప్పుడు మీరు ఆడకుక్కలో బిడియాన్ని చూస్తారు. (సిగ్గు బిడియమూ అన్న రెండు మాటలూ ఒకే అర్థాన్నిస్తాయి.) మగకుక్క అల్లరి చేయకపోయేసరికి ఆడకుక్క పళ్ళికిలించి కోరచూపులు చూస్తూ, మెల్లగా గారం చేస్తున్నట్టు గోల పెడుతూ, కీచుకీచుమంటూ ముందు రెండు కాళ్ళనూ నేలమీద మోకరించి, వెనుక రెండుకాళ్ళనూ సాగిలా పడేసి కొంతసేపు గునుస్తుంది. ఇక ఉద్రేకం ఆమెలో చెలరేగగానే ఆ సిగ్గును కాస్తా గాలికి వదిలి, తన వెనుకభాగాన్ని ప్రియుని ముక్కుకి చూపుతూ తోకని గాలిలో కెగరేస్తుంది. దానికిష్టంలేనట్టు నటిస్తూనే తనంత తానుగా అర్పించుకుంటుంది. కుక్క చూపించే ఈ రకమైన బిడియానికీ ఆడవాళ్ళు చూపించే అభిమానానికి ఎంతో పోలికుంది.

ఉదాహరణకి: మెడిటెరీనియన్ వీనస్‌ను చెప్పవచ్చును. ఆమె తన బస్తి ప్రదేశాన్ని వెనక్కి లాక్కుంటూనే జననేంద్రియాన్ని ఒక చేతి తోనూ, రొమ్ముల్ని మరో చేతితోనూ కప్పుకుంటుంది. ఎప్పుడన్నా స్త్రీలు నగ్నంగా మనకంట పడ్డప్పుడు అలాగే కప్పుకొంటూ పారిపోతారు. ఎందుకని? పురుషుడు చొచ్చుకువచ్చి దౌర్జన్యం చేయకుండా తమ కామాంగాలను కాపాడుకోవటమే దీని అంతర్యం. క్రీస్తు పుట్టక పూర్వం రెండువేలసంవత్సరాల క్రితమే టపిసన్ ద్వీపంలో ఇలాంటి శిలావిగ్రహం ప్రతిష్ఠించివుంది.

కామాంగాలకు ప్రమాదం వాటిల్లుతుందేమోనన్న భయం లేకపోతే ఇలా చేతుల్ని అడ్డుపెట్టుకోనవసరం లేదు. దుర్యోధనుడి కొలువులోదాసీలు నగ్నంగానే ఉండేవారు. అసలు ఆ దాసీలు వస్త్రాలు ధరించకూడదు. ద్రౌపది దాసి అయినా వివస్త్రకాలేదు. గనుకనే కొలువులో వస్త్రాపహరణం యేర్పాటయింది. ద్రౌపది సిగ్గు పడిందిగాని దాసీలు సిగ్గుపడతారా?

పిల్లలముందు నగ్నంగానే తిరిగేందుకు తల్లులు సిగ్గుపడతారా?

కామ భయం లేనప్పుడే స్త్రీ సిగ్గుపడవలసిన అవసరంలేదని ఋష్యశృంగుడి కథ తమకు పాఠం చెపుతున్నది.

చాలా పూర్వకాలంలో ఫ్రాన్సుదేశపు ఉన్నత స్త్రీలు మగనౌకర్ల ముందు సిగ్గుపడేవారు కాదుట! స్నానం చేసేటప్పుడు తొట్టిలో నగ్నంగా వారు నిలబడితే నౌకర్లు కాళ్ళ మధ్య వేణ్ణీళ్ళుపోసేవారట; ఆ నౌకరుల వలన ఆయా కామాంగాలకు అపచారం జరుగదన్న ధైర్యమే వారికి సిగ్గు కలగక పోవటానికి కారణం.

స్త్రీ నగ్నంగా ఉన్నప్పుడు ఆకస్మాత్తుగా ఎవరన్నా చూస్తే చేతులు రెంటినీ అత్యాకర్షణ కేంద్రాలైన రొమ్ములపై బిగించి, తొడల్ని రెండింటిని ఒకదానిపై ఒకటి నొక్కి బుజాన్ని పైకెత్తి నడుము వంచి అరచేతుల్లోముఖం దాచుకుంటుంది. ఇది యురోపియన్ స్త్రీ సిగ్గు. ఇక అంగాన్ని, రొముల్ని తన చేతిలో కప్పుకొనే భారతీయ తరహా స్త్రీలంతా కొంటికోణంగులే. పురుషుల్ని మరింత ఆకర్షించటానికే వారు సిగ్గును అభినయిస్తారు. కొందరు ముఖం పక్కకి తిప్పుకొన్ని కళ్ళు మూసుకొంటారు. పృష్టభాగం చూపెడ తారు. అదొకరకం. కొన్ని జాతులవారు (ఒరియా) ముఖాన్ని మాత్రమేకప్పు కొన్ని తతిమ్మా శరీరాన్నంతటినీ చూపరులకు నయనానందం గా వదిలేస్తారు.

ఆడజంతువులకు ఎద పట్టినప్పుడు మినహా యితర సమయాల్లో సిగ్గును అభినయిస్తాయి. గనుక, ప్రేమకి ఇది సమయం కాదని ఈ అభి నయం ద్వారా అభివ్యక్తం చేస్తోన్నట్లు అర్ధం. మనుష్యునికన్నా తక్కువ జాతి జంతువులన్నిటిలోనూ ఈ లక్షణం స్పష్టంగా కనిపిస్తుంది. ఇవే అలవాటై పోయి అవసరం లేనప్పుడు కూడా ప్రదర్శించటం జరుగుతోంది. అనగా ఎద పట్టినప్పుడు కూడా ఇదే సిగ్గును అభినయిస్తాయని మాభావం. యెలాగంటే ఇందాకటి కుక్కనే తీసుకోండి. ఎద పట్టినప్పుడుఅ తాపాన్ని భరించలేక దానంతటదే మగకుక్క వెంటపడి ఎలాగో దాన్నిరెచ్చ గొడు తుంది. తీరా అది రెచ్చాక వెంటబడగానే పరుగు లంకించుకొంటుంది.

అతి బలవంతం మీద అంగీకరించినట్టు నటిస్తూ చివరకు లొంగుతుంది. కనుక కేవలం మగజాతిని తిరస్కరించటమే సిగ్గుకు పరమార్థం కాదను కోండి. ఒక విధంగా మగవానికిది ఆహ్వానలాంటిదే. స్త్రీలో సిగ్గుపడవలసిదేదో ఉన్నదనీ అదే పురుషునికి వాంఛనీయమనీ తెలిసి ఆడది ఊరిస్తున్నట్లే నటిస్తుంది.

ఇలా ఊరించటం కోసమే ఆడవాళ్ళకు సిగ్గు నేర్పుతారు. వయస్సులో ఆడది సిగ్గుపడకపోతే మగవాడు ఆమెను చూసి భయపడతాడు.

స్త్రీ సిగ్గును జయించవలసిన కర్తవ్యం మగవాడిదే. సిగ్గే ఆమెకు అంగరక్ష! అందుకే ఆమె కన్నె చెఱను విడిపించాలి. కన్నెపొరను ఛేదించాలి. అప్పుడా సిగ్గు దొంతరల తెరలు కూడా తొలగిపోతాయి. పురుషుడు సహజంగా కామ విషయాలలో దౌర్జన్యకారుడు కనుక స్త్రీలు భీతచిత్తలయ్యారు. హరిణేక్షణలయ్యారు. స్త్రీల కామం ఋతువుపై ఆధారపడి వుంటుంది. పురుషుడి కామం సర్వకాల సర్వావస్థలందూ వుంటుంది. కనుక పురుషుడికి రక్షణ అవసరంలేదు. కాని స్త్రీకి మాత్రం రక్షణ చాలా అవసరం.

దంపతులు ఉభయులకూ రతిసమయంలో శత్రువుల బారినుండి రక్షణ అవసరం. సరిగ్గా అదే సమయంలో కసితీర్చుకోవటం శత్రువులకు తేలిక. అందుకే ఇలాంటి సమయంలో బాణం వేశావు గనుక నువ్వు కూడా భార్యతో కలుస్తున్న సమయంలో ఛస్తావు, సుమా అని లేడి ఒకటి పాండురాజును శపిస్తుంది. అప్పుడే వృద్ధుని, పారిపోలేకుండా నిలబడిన దానిని, పెంటితో కలిసేదానిని, రోగిష్టిని ఎంత కిరాతకుడు గూడా చంపడని చెపుతుంది.

శత్రువులకన్నా ఎక్కువగా అసుయాగ్రస్తులైన షుద్రకుల ప్రమాదం ఎక్కువ. అందుకే స్త్రీలు స్త్రీలతో బాటు పురుషులు రతికి సంబంధించిన కాల ప్రదేశాలను ఎవరికీ వెల్లడి కానివ్వరు. ఇది దాచతగ్గ సంగతనీ, రహస్యంగా జరపదగ్గదనీ ఎప్పుడైతే అనిపించిందో, ఈ కలయికకు సంబంధించిన కొన్ని నీతి నియమాలు ఏర్పడ్డాయి.. వాటిని ఉల్లఘించటం కూడా జరిగింది.

ఏ చర్యగాని రహస్యంగా ఎప్పుడైతే భావించబడిందో అప్పుడే అది తప్పుగా అంగీకరించబడినట్లు. ఆ విధంగా అది చీకటితప్పయి, దొంగ తనంగా ఆనందించదగ్గ పాపకృత్యమైంది.

ఎలాగ? అదే మనవిచేస్తా.

అడవి జంతువులు సహజంగా రతిసమయంలో మరోప్రాణికంట బడవు. పెంపుడు జంతువులకు ఆ నియమంలేదు. ఎంత ఆటవికుడైనా సరే అరణ్యగర్భంలో ఏకాంతంగా గాని లేదా తన పర్ణశాలలోగాని తన భార్యతో సంప్రయోగిస్తాడు. అయితే పదిమందిలోనూ మహాయజ్ఞంలా జరిపే ఆచారం లేకపోలేదు. అక్కడ ఆచారమే ప్రధానం గాని, ఆత్మసంతృప్తి కాదని గ్రహించండి. చీకటీ, మూసిన తలుపులు పర్ణకుటీరమూ, ఏకాంతమూ శృంగారవస్తువులయ్యాయి.

సిగ్గులోంచి వచ్చిందే కొంటెతనం కూడా. ఈ కొంటెతనం జంతువుల నుంచే మనిషి నేర్చుకున్నాడు. కామం ఒకవంక పెల్లుబుకుతుంటే సిగ్గు మరోవంక చల్లారుస్తుంటే ఈ పరస్పర విరుద్ధశక్తుల సంఘర్షణలో కొంటెత నం జనిస్తుంది. ఈ విధంగా దీనికి శారీరక ప్రాముఖ్యత, మానసికప్రాముఖ్యత ఉన్నాయి. ఒకవిధంగా ఈ కొంటెతన మనే క్రూర నారాచంతోపురుషులహృద యాలను చీల్చి చెండాడే రాక్షసత్వం స్త్రీ జాతిలో యెక్కువగా కనిపిస్తుంది.

మగదుప్పి చుట్టూ ఆడదుప్పి పరిగెడుతుంది, దాన్ని చేరనివ్వదు. అలా అని విడిచిపెట్టి తనమానాన తానుపోదు; అదే కొంటెతనం! కవ్వించి, రేకెత్తించి ప్రేరేపించి విడిపించాలన్న సరదా! తీరా వెంటబడితే పారిపోతుంది.

ప్రణయంలో ఈ కొంటెతనం అతి ముఖ్యభాగం. తరుముకెళ్ళే వారొకరు; తరుమబడే వారొకరు ప్రణయంలో తప్పదు. జంతువుల ప్రణయంలో వలె ఆటవికుల ప్రణయంలో కూడా ఈ భావం ఉంది. నాగ రిక స్త్రీ పురుషులు ఆ అనాది విధానాలనే అభినయిస్తారు. కొందరి పద్ధ తులు మోటగా వుంటాయి. మరికొందరివి నాజూకుగా ఉండవచ్చును.

"ఏమి తనకు తెలియనట్లు, ముక్కుపచ్చలారని ముద్దగుమ్మలా నటిస్తూ ముఖం సీరియస్‌గా ఉంచి సిగ్గుపడుతూ, భయపడుతూ కామమే తనలో లేనట్లు నటిస్తుంది కొత్త పెళ్ళికూతురు. శోభనంనాటి రాత్రి ఆమెకు అన్నీ మనం నేర్పుతున్నట్లు భ్రమపడతాము. నిజానికి ఆమెకే మనకన్నా ఎక్కువ తెలుసు. మనలో ఆమెను జయించాలన్న కోరికఎక్కువపటం కోసం ఎన్నో అడ్డు, ఆటంకాలు పెడుతుంది. ఆమె అమాయకత్వమాధుర్యాన్ని, సిగ్గును దోచుకోవటం మనకు సంతోషమేగాక గర్వకారణంకూడా.

స్త్రీలలో కొంటెతనం కనిపించేసరికి పురుషుల్లో వాళ్లని బాధించాలన్న కోరిక (శాడిజం) కలుగుతుంది. అది కూడా అమాయకమైన సహజ ప్రవృత్తే.

"తిరస్కరించే ఆడదాన్ని కావలించుకొని ఆమెను మరింత సిగ్గుపడేటట్టు, పారిపోయేటట్టుచేసి తరుముకెళ్ళటంలో ఎంతో ఆనందముంది! ఆ ఆనందం కోసమే మగవాళ్ళు తపస్సు చేశారు. అసుర వివాహాలన్నీ ఇంతేగా! అప్పుడు కన్యలు అభినయించే సిగ్గు కృత్రిమంగా వున్నా ఫరవాలేదు. అది ఆనందాన్నే కలిగిస్తుంది. అసూర్యంపశ్యలకు ప్రాధాన్యత ఎక్కువ. అరబ్బులు కూడా మగవాడి కంటబడని మగువకే విలువనిస్తారు."

(నికోలస్)

మగవాళ్ళంటే మహాభయాన్ని స్త్రీలు అనాదిగా నటిస్తారు. ఆటవిక జాతుల నృత్యాల్లో ఇది స్పష్టంగా కనిపిస్తుంది. ఆధునిక నాగరికుల వివాహ సాంప్రదాయాలలో కూడా సిగ్గు లీనమైపోయింది. పెళ్ళికూతురికి పెళ్లికొడుక్కి మధ్య తెరను ఆకర్షణకోసమే కడతారు. ఈ తెరకే అన్ని జాతుల్లోనూ ఎక్కువ ప్రాముఖ్యత ఉంది.

వేశ్యకు సిగ్గూ, లజ్జా ఉండవు. లేకపోయినా ఆమె ఉన్నట్లే నటించాలి. నటిస్తుంది కూడా. వేశ్యలో ఎక్కువ కొంటెతనం ఉండటం వల్లనే మగవాళ్ళు ఇల్లాళ్ళపై కన్నా వేశ్యలపైన ఎక్కువ మోజుచూపిస్తారు. వేశ్య తానెంత అనుభవశాలి అయినా అలా ప్రవర్తించక ఏమీ ఎరుగనిముద్దరాలి

వలె నటిస్తుంది. శోభనం నాటి రాత్రి అమాయిక పల్లెపడుచు చూపించే సిగ్గుదొంతరలన్నిటినీ వేశ్య కృత్రిమంగా నటిస్తుంది.

ప్రియుడు అక్కునచేరి ముద్దుగొంటున్నప్పుడు తప్పించుకొనే యిల్లాలికన్నా, అతనివద్ద భయాన్ని మృదువుగా ప్రదర్శించే సుందరాంగి కన్నా అతనిలో కామోద్రేకాన్ని రెచ్చగొట్టే వ్యక్తి ఉండదు. కనుక పురుష స్వభావం ఎప్పుడూ స్త్రీల అమాయకత్వాన్నే కోరుతుంది. తెలివిని భరించ లేదు. స్త్రీల నుండి పొందదగిన సౌఖ్యాన్ని ఆకస్మికంగా కొల్లగొట్టు కోవా లనే చూస్తుందిగాని ఉభయుల ఇష్టంమీద కాదని చెప్పాలి.

"స్త్రీని నగ్నంగా దొంగచాటుగా చూసినప్పుడే నాలో ఉద్రేకంకలుగు తుంది." అని ఒకడు వ్రాస్తున్నాడు.

ఒక స్త్రీ కూర్చుని మూత్రవిసర్జన చేసుకుంటూండగా, దొంగచాటు నుంచి చూడటంవలన మరొకడు ఉద్రేక పారవశ్యాన్ని పొందుతున్నాడు.

అమాయకులైన ఆడపిల్లల జననాంగాలను విడమరచి చూడటం ఒకరికి పిచ్చి ఆనందాన్నిస్తుంది. వాడే వేశ్యల జోలికి పోడు.

గౌరవనీయ కుటుంబాలలోని స్త్రీలకు తన అంగాన్ని ప్రదర్శించడం ఇంకొకడికి యిష్టం.

వీళ్ళంతా స్త్రీల అమాయకత్వం మీద ఆకస్మిక దండయాత్ర చేయాలన్న భావంగలవాళ్ళే. ఇవన్నీ ఒకరకంగా మానసిక వ్యాధులే.

స్త్రీని అనుభవించాలన్న కోరికలోనే పురుషుడి వక్రబుద్ధి ఇమిడి వున్నదని ఒక విలేఖరి వ్రాశాడు.

"స్త్రీమీద ఎంతో ద్వేషం ఉన్నవాళ్ళకి కూడా, యవ్వనం అంకురించిన రోజులలో స్త్రీ యెంతో ఉన్నతురాలివలె కనిపిస్తుంది; యెక్కడో పురుషుడికి అందని ద్రాక్షపండులా; థక్తుమీద కూర్చున్నట్లు, ఆమె అతిపవిత్రమూర్తి అయినట్లు, ఆమెలో నిగూఢశక్తులేవో ఉన్నట్లు అనిపిస్తుంది. మనకిబాల్యం లో మనదృష్టిలో "అమ్మ" కున్న స్థానం ఇదే! అదే స్త్రీమూర్తి ఇప్పుడుప్రియు రాలుగా మారుతుంది. మారవలసిన రోజులివి! కాని, అంత పవిత్రమూర్తి

కి కూడ నీచమైన, అసహ్యాకరమైన పాశ్వికమైనమురికి కామవాంఛ. అను భూతులు ఉంటాయన్న సంగతి ఈ నూనూగు మీసాల వయస్సులోతొల కరిస్తుంది. ఆ యువకుడు స్త్రీ ఈ విధంగా పతనం పొందడాన్ని సహించ లేడు కాని, తనను కూడా కామోద్రేకం పీడి స్తుందిగదా! తన అవసరంతీరాలి! తీర్చుకుంటూ కేవలం తనను సుఖపెట్ట టంకోసమే పదభ్రష్ఠురాలైన దేవ కన్న అని సరిపెట్టు కుంటాడు. అలాంటి స్త్రీని సంతోష పెట్టడం దాదాపు యజ్ఞమంత పని! దేవతతో చనువు తీసుకున్నట్లే.

"దేవతలు స్వేచ్ఛా కాముకులు, కాని యితని దేవత మాత్రం నిష్కామి. ఆమెకు కామం ఉండదు. అతని కామం తీర్చటానికే ఉంటుంది.

--ఇదే మూఢనమ్మకాలను అన్ని యుగాల, అన్నితరాల యువ కులూ కలిగి వున్నారు. నాగరికత ప్రబలినా, వివేకం వృద్ధిపొందినా ఈ భావాలు మాత్రం మారలేదు. కామం పాపం కాదని, స్త్రీ పురుషులు మను ష్యులే కనుక వారు ఉభయులకీ కామం కూడా సమానమనీ, సహజమనీ మన వివేకం చెపుతున్నది.

కాని, మనకి తెలియకుండానే మన అజ్ఞాత చైతన్యం స్త్రీని అక ళంకమూర్తిగా, పవిత్ర వ్యక్తిగా చూడనారంభిస్తుంది. ఆమెకు కామాను భవం తగని పని; అపవిత్రమైంది; కామమే ఆమెకు కళంకం.

పురుషోప భోగానికి స్త్రీని బలివెయ్యటం సహించరానిది. ఆమెలో కామాన్ని ప్రేరేపించటం వికసిత పుష్పాన్ని నలిపివెయ్యటం లాంటిది. నిష్కళంక చంద్రవదనకు మచ్చ కలిగించటం లాంటిది... ఇది సాధారణంగా స్త్రీల యెడ పురుషులకుండే భావం.

అయినా ప్రతిపురుషుడూ అనాఘ్రాత పుష్పాన్నే కోరుతాడు. ఆమెను రంజింప జేయాలనుకోడు. గాని రమించాలని చూస్తాడు. ఆమెకు భావప్రాప్తి కలిగించాలి; ఆకాశపథాలలో పయనించే ఆ పవిత్ర వ్యక్తినిభూ మార్గం పట్టించాలి; ఆత్మను శరీరం జయించాలి. పవిత్రతను అపవిత్రత జయిం చాలి. పరాన్ని ఇహం జయించాలి. కన్యను వివాహ యోగ్యగా యెన్నుకోవ

టంలో వున్న మత దృష్టి ఇదే. ప్రేమ పారవశ్యంతో ఆమె నుండి పైశాచికా నందాన్ని పొందటమే జీవిత పరమార్ధంగా యీపవిత్ర భావుకులు ఊహి స్తారు.

వీరి ఊహలకి నేటికీ చలామణీ ఉన్నప్పటికీ, వివేకాన్ని వినియోగించి చూస్తే ఇవి చాలా అన్యాయమైనవిగా తోచక మానవు. అయినా వీటికి మతం మద్దత్తు నివ్వటంవల్ల అన్యాయం న్యాయంగా వ్యాప్తి పొందగలిగింది.

ఫలితంగా కన్నెపొరకు ప్రాధాన్యత వచ్చింది. శోభనం నాడు కన్నె పొర చిరిగితేనే ఆమె పవిత్రురాలైనట్లు. పవిత్రతను అపవిత్రం చేయటమే వివాహం కనుక కన్నెపొర విధిగా ఉండాలి. ఆ కన్నెపొరను చేధించాలి.

క్రైస్తవ మతరీత్యా సంప్రయోగమే మహాపాపం. దీనికి మాంస దోషమని పేరుపెట్టారు. అయినా ప్రతీ వొకడూ ఈ దోషం చేయకతప్పదు. ఈ విధంగా ఇది "పవిత్రదోష"మైంది.

పవిత్ర దోషాలు చేసే పురుషులందరూ పవిత్రులైన కన్యల్నే అప విత్రం చేయాలని చూస్తారు, ఇదే ఆశ్చర్యం.

**ప్రశ్న: పురుషుడు తానెంత అవినీతిపరుడైనా అమాయకురాలైన పవిత్ర కన్యతోనే సంయోగాన్ని కాంక్షించినట్లు, స్త్రీలు కూడా పురుషుడిలో అమాయకత్వాన్నీ, పవిత్రతనీ, బ్రహ్మచర్యాన్నీ కోరతారా?**

ఈ ప్రశ్నలో రెండు ముఖ్య విషయాలు ఇమిడి ఉన్నాయి. సాధారణ యువతీ స్వభావం ఒకటి; ప్రౌఢవేశ్యా స్వభావం ఒకటి.

ముందు ప్రౌఢవేశ్యా స్వభావం చెప్పుకుందాం: వేశ్యలకు తాము అపవిత్రులమనే కించ ఉంటుంది. ఆ కించతోనే వాళ్ళు లోలోపల కృంగి పోతున్నా పైకి హుషారుగా ఉంటారు. తమ శరీరం మలినమైనదన్నభావం వారిలో ఎప్పుడైతే అంకురించిందో వారు పవిత్రతను, అమాయకత్వాన్నీ ప్రేమించగలరు. అందుకే ప్రౌఢవేశ్యలు అమాయకులైన బ్రహ్మచారుల్ని ఎక్కువగా ప్రేమించిన ఉదంతాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అపవిత్రులూ వ్యభిచారులూ అయినా పురుషులు కన్యల కెలాంటి ఉదాత్తస్థానాన్ని తమ

మనసులో కల్పించుకుంటారో, సరిగా అలాంటి స్థానాన్నే ప్రౌఢవేశ్యలు కూడా అస్కలిత బ్రహ్మచారులకిస్తారు. ఒక విధంగా లేత ముంజెల్ని తినాలన్న కోరిక లాంటిది.

ఇక సాధారణ యువతీ స్వభావం మనవిచేస్తాను. పురుషుడు పవిత్రుడై ఉండాలన్న కోరిక ఆమెకు కూడా ఉంటుంది. కాని అమాయకుడై ఉండాలని మాత్రం ఉండదు. పవిత్రుడైన అమాయకునికన్నా, అపవిత్రుడైన సరసునే ఆమె కోరుకుంటుంది. స్త్రీ సహజంగా సిగ్గరి. మందగొడి. పురుషుడు తన చురుకుతనం వలన, నైపుణ్యం వలన, ప్రజ్ఞాపాటవాల వలన ఆమెను రెచ్చగొట్టాలి. ఆమెలో కామాన్ని ప్రేరేపించాలి. అలాంటివాడు మొద్దులా పడివుంటే ఆమె కలలన్నీ ఏమిగాను? ఆమెయేఅతన్ని ప్రేరేపించవలసి వస్తుంది. స్త్రీ పురుషుణ్ణి ఆకర్షించి భీతచిత్తంతో పరుగెడుతుంది. పురుషుడు తరుముకెళ్ళి పట్టుకోవాలి. వేటగాని దృష్టిని ఆకర్షించి, పారిపోయి అతనిచే తరుమబడి అతని బాణాల దెబ్బచే కూలబడినలేడిలా ప్రియుని మన్మథబాణాలచే జితురాలు కావటం ఆమెకు సహజధర్మం. అమాయకుడైన పురుషుణ్ణి పెళ్ళాడిన స్త్రీ వేటగా తరుముకెళ్ళే లేడివంటిది.

అది విరుద్ధం గదా! అందుకే ఏ యువతిగాని తన ప్రియుడు తన సాటివాడుగాని, తనకన్నా పెద్దవాడుగాని అయినప్పుడు అతను ముద్దరాలి వలె అమాయకంగా పడివుండటాన్ని సహించనూలేదు, క్షమించనూలేదు.

ఇక ప్రౌఢలున్నారు. అలాగే ఉద్రిక్తులై అవకాశం లభించనియువతులు ఉన్నారు. అలాంటివారు అమాయకులైన మగపిల్లల్ని వినియోగించుకున్న ఉదంతాలు లేకపోలేదు. అయినా వీరికిది బొమ్మలాట లాంటిది. చందనం బొమ్మలకి ఉత్తుత్తి పాలిచ్చినప్పుడు కలిగే మానసిక సంతృప్తి లాంటిది కలిగినా దైహిక సంతృప్తి మాత్రం కలగదు. ఇలాంటి సన్నివేశాలకు ఈ స్త్రీలు చుంబన పరిష్వంగాలతో సంతృప్తి పడతారేగాని పరిపూర్ణ సంప్రయోగాన్ని పొందలేరు.

**ప్రశ్న: ఇతరుల సొత్తు అపహరించాలని, కామంలో చేయకూడనివి**

**చేయాలన్న కోరిక స్త్రీలకు అజ్ఞాతంగా ఉండదా?**

జవాబు: ఉంది; పరదారాపహరణం పురుషుల కేవిధంగా సంతోషాన్నిస్తుందో, ఇతర స్త్రీల భర్తల్ని అపహరించటం కూడా స్త్రీలకుసంతృప్తినిస్తుంది. ముఖ్యంగా "వద్దన్నదాన్ని" పొందాలన్న స్వభావం స్త్రీలకు అధికంగా ఉంటుంది.

ఈ స్వభావం దుర్బుద్ధిగాని, వక్రబుద్ధిగాని కాదు. అలా అనుకోకూడదు. ముఖ్యంగా అమాయకులైన స్త్రీలల్లోనే ఈ ప్రవృత్తి ఉంటుంది. వాళ్ళకి సిగ్గు, లజ్జ, పిరికితనమూ ఎక్కువగా ఉండటమే కారణం. అలాంటి వాళ్ళకి కొంపలు మునిగే పనులు చేయాలని, సాహసించి ఏడిపించాలనీ ఉంటుంది. అదొకరకమైన ఉద్రేకమే.

సృష్టిపుట్టినప్పుడు ఆదాము-అవ్వల కథలో అవ్వ వద్దన్నపనే చేస్తుంది. ఏ పండునైతే ముట్టవద్దని భగవంతుడు ఆజ్ఞాపిస్తాడో ఆ ముట్టరాని పండును (పురుష లింగానికి సంకేతం) ముట్టుకుంటే ఏమవుతుందో చూడాలన్న కోరిక ఆమెకు జనించింది.

కూడదన్న పని చేయటంలో ఉండే సంతోషమే సంసార స్త్రీలు ఎక్కువగా అభిచరించటానికి కారణం. అందుకే కామ విషయాల్లో స్త్రీలను అదుపాజ్ఞల్లో ఉంచటం మంచిదికాదని కొందరి అభిప్రాయం. పెళ్ళాన్నియింట్లో పెట్టి బయట తాళం వేసుకువెళ్ళే స్వభావం చాలామంది పురుషులకుంది. అలాంటప్పుడే స్త్రీలకు కొంటెబుద్ధి పుట్టి తమకు ఏదైతే లభించనివ్వటంలేదో దాన్నే పొందాలన్న కోరిక పుడుతుంది. 'వేసినసీళ్ళు వేసినట్టే ఉన్నాయిగాని మూడు నెలల కడుపొచ్చిందట ఆ యిల్లాలికి' అన్న సామెత విన్నారుగదా! నీతి నియమాలను ఉల్లఘించే స్వేచ్ఛ ఉన్నప్పుడే స్త్రీలు జాగ్రత్తగా ఉంటారు.

**ప్రశ్న: సిగ్గులేని ఆడదాన్ని చూస్తే మగవాడికి ఏమనిపిస్తుంది?**

ఆడది సిగ్గుపడకపోతే మగవాడే సిగ్గుపడతాడు. "వనిత తనంతతా వలచి వచ్చిన చుల్కన కాదె ఏరికిన్!" అని చెపుతాడు అల్లసాని పెద్దన్న.

ఎందుచేత? తనంతతా వలచి వచ్చిన స్త్రీలో సిగ్గు కనిపించదు; కనుక చుల్కన కాకపోయినా, అలాంటి స్త్రీని చూసేసరికే వణుకు పట్టుకుంటుంది పురుషుడికీ. సిగ్గు ఎరుగని స్త్రీని మగరాయుడంటాము. మగవాడికి సిగ్గు ఉండకూడదని అర్థం. కాని, మగవాడికి అంతర్యంలో సిగ్గు వుంటుంది. తనని చూసి తనకన్నా సిగ్గుపడే ఆడదానిపై కొంటెతనం చేయగలడుగాని, ఆమె ఏ సమయంలోనైనాసరే ఏ మాత్రం సిగ్గువిడిచినా తాను సిగ్గుపడతాడు. చదువుకున్న స్త్రీలలో ఈ సిగ్గు సన్నగిల్లుతుంది. గనుకనే వారి దాంపత్యాలు చిరకాలం మన్నటం లేదు.

ఈ విధంగా సిగ్గు స్త్రీలల్లో కామోద్రేకానికి చిహ్నమవుతున్నది. అనగా వారిలో కోరిక కలగగానే, జననేంద్రియంలో సంచలనం కలిగిన హేతువుగా సిగ్గు కలుగుతుంది. కనుక సిగ్గు స్త్రీల కామోద్రేకానికి చిహ్న మను కోవాలి. స్త్రీల సిగ్గే పురుషునిలో కామోద్రేకాన్ని రెచ్చగొట్టే సాధన మనుకోండి. ధైర్యంగా నిలబడే స్త్రీ కన్నా, సిగ్గుపడి పరిగెత్తే స్త్రీయే ఉత్తమకాముకి. కామభావనలు కలిగినందువల్లనే స్త్రీలు సిగ్గుపడతారు.

**ప్రశ్న: ఒకణ్ణి చూసి విపరీతంగా సిగ్గుపడే స్త్రీయే అతనితో మనసారా సంబంధాన్ని పెట్టుకోగలదు. అలాంటప్పుడు ఈ సిగ్గంతా మోసం, వంచన, దగా కావా?**

కావు. ఆ పురుషుణ్ణి చూసినంతనే ఆమెలో కామవికారం కలుగు తున్నదన్నమాట సత్యమే! అయినంత మాత్రాన సిగ్గరి అయిన స్త్రీ, స్వభావతః ముఖభావంగల స్త్రీ అవుతోంది. కనుక సామాన్య స్నేహముకున్నంత మాత్రాన, లేదా యే మాత్రమైనా అవకాశం దొరికినంత మాత్రాన అతనితో కామ సంబంధాలు పెట్టుకోదు. అతనంటే ఎంత ఇష్టమున్నాసరే, సంఘ మంటే భయం పుడుతుంది. ఇతరులు ఏమనుకుంటారో అన్న భయం. ఆ భయం వల్లనే నలుగురూ తన గురించి చెడ్డగా చెప్పుకొనేటంత సిగ్గు మాలిన పని మాత్రం సుతలామూ చెయ్యదు.

ఆమె కన్య అయి, అతనితోనే ఆమెకు వివాహమైనట్లయితే, ఆ

సిగ్గు పెరిగి పెరిగి అకస్మాత్తుగా పటాపంచలవుతోంది. అంతవరకూ సిగ్గు వల్లనైతే నేమి, లోకాపవాద భీతివల్ల నైతేనేమి ఏ మహదానందానికి తాను దూరమైందో దానిని విశృంఖలంగా అనుభవిస్తుంది. అతన్ని ఆనందపరచి, తాను ఆనందపడుతుంది.

స్త్రీల ముందు కూడా సిగ్గుపడే స్త్రీలున్నారు. వాళ్ళల్లో వాళ్ళకి లైంగిక సంబంధాలు లేకపోవచ్చుగాక! అయినా అలాంటి వాళ్ళు కూడా భర్త విశ్వాసాన్ని సంపాదించిన తరువాత అతని దగ్గర మాత్రమే సమస్త సిగ్గునూ త్యజించి ప్రవర్తించగలరు.

స్త్రీలంటే సిగ్గుపడే మగవాళ్ళు కూడా భార్యదగ్గర సిగ్గుపడటం జరగదు. ఒక విధంగా కామాన్ని ప్రేరేపించేదీ, కామం వలన ప్రేరేపించబడేదీ అయినప్పటికీ ఈ సిగ్గు కామానుభవంవల్ల హరింపబడుతుందనే చెప్పాలి.

## జుగుప్స

**ప్రశ్న: స్త్రీలను చూసి పురుషులూ, పురుషుల్ని చూసి స్త్రీలూ సిగ్గుపడటం సామాన్యమే. కాని అద్దంలో తమని తాము చూసుకోటానికి స్త్రీ పురుషులెందుకు సిగ్గుపడతారు?**

జవాబు: సిగ్గుకు మరో కారణం జుగుప్స. సాంఘికంగా నిరుపయోగమైన దానిపై జుగుప్స కలుగుతూ ఉండటం మానవధర్మం. కొందరి ప్రవర్తన చూసినా కొందరి చేష్టల్ని ప్రేమల్ని చూసినా ఈ జుగుప్స కలుగుతూంటుంది. అడవి మనుష్యులలో కూడా ఈ జుగుప్స కనిపించటంకద్దు. జంతుదశను దాటిన మానవుడికి నలుగురిలో ఆపులింత, అపాన వాయువు, తుమ్ము, దగ్గుపంటివన్నీ అసభ్యమనిపించి వుంటాయి. ఏదైనా నలుగురిలోనూ ఒకడు చేయకూడని పని అసభ్యమౌతుంది. కొన్ని కొన్ని జాతులకు కొన్ని రకాల ప్రవర్తనలు అసభ్యమవుతున్నాయి. కొన్ని పరిస్థితులలోఅసభ్యమైనవి మరికొన్ని పరిస్థితులలో కావు.

ప్రమాదకరమైన వాటిమీదా, బొత్తిగా నిరర్థకమైన వాటిమీదాజుగుప్స కలగటం సహజం. మలము, మూత్రము, వీర్యము, రజస్సు మున్నగు

ద్రవ్యాలు, అవులింత, అపానవాయువు, తుమ్ము వంటి వాయువులూ, జీర్ణానికి కామానికీ సంబంధించినవి జుగుప్సాకరమైనాయి. మలమూత్ర విసర్జకావయవాలకు సంబంధించినదంతా ప్రమాదకరమైనదనే అభిప్రాయం ఆటవికజనంలో ఉంది. ఋతుస్రావం గల స్త్రీ పైెల గాలి తగిలేసరికి చెట్ల పువ్వులన్నీ మాడిపోతాయనే మూఢనమ్మకం నేటికీ మనలో వుంది. కేవలం తన పొట్టనింపుకొనేవాడు స్వార్థపరుడు. అలాగే తన కామాన్ని తీర్చుకొనేవాడు కూడా. వారిజన్మలు నిరర్థకాలు; గనుక జుగుప్సాకరాలే.

ప్రమాదకరమైన ద్రవ్యాలను విసర్జిస్తాయి గనుక జననేంద్రియాలు, నిరర్థకమైన ద్రవ్యాన్ని విసర్జిస్తాయి గనుక జీర్ణేంద్రియాలు, జుగుప్సా కరమన్న భావంతోనే ఆటవిక జాతులవారు కూడా ఎంత నగ్నంగాతిరిగినా మలమూత్ర విసర్జన సమయంలో చాటుకుపోతుంటారు. జుగుప్సాకరమైన ఈ లింగాలు ఇతరుల కంటబడినపుడు సిగ్గుపడటం ఆశ్చర్యంకాదు. కాని వాటిని తాము చూసుకున్నా సిగ్గుపడటం జరిగింది.

కనుకనే అంగాన్ని మరుగుపరచి ప్రియునిలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టేందుకు బట్టలు అవసరమన్న సిద్ధాంతం సత్యమే అయినప్పటికీ సమగ్రం కాదు.

**ప్రశ్న: ఎందుచేత?**

వస్త్రాలను కేవలం ఆకర్షించటంకోసమే ధరించేటట్టయితే ఆకర్షించబడ్డ వ్యక్తి వచ్చి చీరల్ని తొలగించబోతూంటే అడ్డుపెట్టకూడదు. అడ్డుపెట్టినా అట్టేసేపు ఉండకూడదు. కాని కొందరు ఆటవికులు ప్రాణాలన్నా ఒదులుకుంటారుకాని, మానాన్ని వెల్లడికానివ్వరు.

**ప్రశ్న: విసర్జించటమే జుగుప్సా కరమైనట్లయితే సేవించటం మాత్రం కాదా?**

జాతి జాతికి సభ్యతా ప్రమాణాలలో తేడా ఉన్నదని లోగడ చెప్పుకున్నాం. మనకి నిలబడి ఉచ్చపొయ్యటం అసభ్యత. ఇంగ్లీషు వాడికి అసహ్యంకాదు. ఎస్కిమోజాతివారికి మూత్రం చాలా అమూల్యమైన

పదార్థం. నలుగురి మధ్యా కూర్చుని ఉచ్చపోయటం కూడా వారికి అసభ్యం కాదు.

ఈసారి పైప్రశ్నకు జవాబు చెప్పుకుందాం.

నలుగురి కళ్ళుముందూ తినటం కొన్ని జాతులవారికి తప్పు నేటికీ బ్రాహ్మణులు మరోజాతి చూస్తూండగా భోజనం చెయ్యరు. కుల మంతా కుటుంబమే కనుక వారిలో వారికి ఫరవాలేదు.

నలుగురిలోనూ తినటం కొందరికి తప్పు. బొత్తిగా సిగ్గులేని పని అనుకుంటారు. టవాటియన్ జాతివారికి అసభ్యతంటూ లేదు. అయినా వారు కూడా నలుగురిలోనూ తినరు. అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళు సైతంవారికి కావలసినదంతా బుట్టల్లో పెట్టుకొని దూర దూరంగా కూర్చుని తింటారు. మధ్య ఆఫ్రికా లోని అడవిజాతివారు (పాలువాతెగ) ఏదైనా తాగుతున్నా తింటున్నా ముఖానికి గుడ్డ అడ్డం పెట్టుకుంటారు. మరొకళ్ళు చూస్తే మానభంగమైనంత గొడవ. అందుకే భార్యాభర్తలు కూడా యెవరి వంట వారుచేసుకోవలసిందే.

అన్నం తింటున్నప్పుడు మగవాడి కళ్ళు బడకూడదని మన ఆడ వాళ్ళ ఆచారం.

సెంట్రల్ బ్రెజిల్‌లో స్త్రీ పురుషులు నగ్నంగానే తిరుగుతారు. కాని ఒకళ్ళ ముందు మరొకరు అన్నంతినరు. అలా ఎవరైనా తినటాన్ని చూస్తే అవమానంతో తల వంచుకుంటారు; నలుగురిముందూ నగ్నంగా నిలబడటానికి మన స్త్రీలెంత అవమానపడతారో అన్నం తినటానికి వాళ్ళంత క్షోభపడతారు.

ప్రౌఢ స్త్రీలల్లో సిగ్గు చిరాకు రూపంలో వుంటుంది. వాళ్ళకి సిగ్గువేసినప్పుడల్లా ముఖం చిట్లించుకుంటారు.

ఎదటివాళ్ళకి ఇబ్బంది కలిగిస్తున్నామే మోనన్న భయం కలిగినా బాధగా, ఇబ్బందిగా ముఖం పెడతారు. అలాంటి ఇబ్బందేదీ వాళ్ళవల్లకల గటం లేదన్న నమ్మకం చిక్కగానే ఎబ్బెట్టుగా ఉంచిన ముఖాన్నేప్రసన్నంగా

దిద్దుకుంటారు. కనుక కొంతకాలం యవ్వన సుఖాలను అనుభవించిన స్త్రీలు ఎబ్బెట్టుగా ముఖం పెట్టారంటే సిగ్గుపడుతున్నారనే భావించాలిగాని, అసహ్యించుకుంటున్నారని మాత్రం అనుకోకూడదు.

తరాతరాలుగా స్త్రీజాతి నీచంగా చూడబడుతూ వచ్చింది. బహిష్టు స్రావాలు, పురిటి స్రావాలు పురుషజాతికి జుగుప్సాకరంగా కనిపించటమే కారణం. పురుషులవలన నీచంగా చూడబడిన కారణంగానే స్త్రీలుతమని తాము నీచంగా చూడనేర్చారు. అదే సిగ్గు.

అలాగే యవ్వనం సడలిన స్త్రీల సంగతి కూడా. తాను యువతిగా ఉన్నరోజులలో ఏ ఉరోజాలైతే బిగిని ప్రదర్శించి భర్తను ఆకర్షించుకున్నాయో సంతానంవల్లనైతేనేమి, యవ్వనానుభవం వల్లనైతేనేమి సడలి వ్రేలాడుతూ చూడ దుర్భరంగా తయారవుతాయి. అలాగే జననేంద్రియం పురుళ్ళువల్ల బిగిని కోల్పోయి సడలిపోతుంది. ఆ పరిస్థితులలో వారికి తాము ఆకర్షణను పోగొట్టుకున్నామేమోనన్న దిగులు బయలుదేరుతుంది. అదే చిరాకుగా మారుతుంది. ఈ చిరాకుని స్వభర్త విషయంలోనేగాక, పరపురుషుని విషయంలోనూ స్త్రీలు ప్రదర్శిస్తారు. ఆ కారణంగానే సాత్విక కామ సంబంధాలకు తిరస్కరిస్తారు.

కనుక సిగ్గు యావత్తూ పూర్తిగా స్త్రీల జననేంద్రియ ప్రాంతాన్ని దాచుకోవాలన్న కోరికకు సంబంధించిన విషయంగానే భావించకూడదు. యోనిప్రదేశం కేవలం కామకేంద్రమే కాదుకదా; మూత్రవిసర్జకాంగంకూడా. ఆ కారణం వల్లనే జననాంగాన్ని ఆకర్షక కేంద్రంగా ప్రదర్శించటం మాని, దాచుకోవలసి వస్తున్నది. ఈ స్వభావం పక్షులలోనూ అధమతరగతి క్షీరధాలలోనూ (అనగా పాలిచ్చి పెంచు జంతువులు) స్వతహాగా కనిపిస్తుంది. ఎక్కడ బురద అంటుకుంటుందో అన్న భయంతో చాలా జాగ్రత్తగా ఉంటాయి. చాలామంది మనుష్యులకన్నా జంతువులే తమ కాలాన్నీ శక్తినీ పరిశుభ్రత కోసం వినియోగిస్తాయి. తమ మలం పంటిని అంటుకొని వుండకుండా సాధ్యమైనంత జాగ్రత్త తీసుకొంటాయి. కామాంగాలపైనున్న

నున్న అసహ్యామే మలవిసర్జకాంగాలపై కూడా వుండటం సహజం.

ఈ సహజ అసహ్యామే మనుష్యులలో విరివిగా కనిపిస్తుంది. నలుగురి ముందు అసహ్యంగా, అసభ్యంగా కనిస్తామేమోనన్న సాంఘిక భయమే సిగ్గుగా తయారయింది. అందుకే అనాదికాలంలో స్త్రీ పురుషులువివస్త్రులుగా నున్నప్పటికీ, రాను రాను బట్టలు ధరించటం ప్రారంభించారు. వస్త్రధారణ సంఘంకోసమూ, ఆత్మ పరిశుభ్రత కోసమూ అయింది.

ప్రపంచంలో ముఖ్యంగా "మలక్కానైగర్ నదీ తీరవాసులు" (ఆఫ్రికా) ఇండియాదేశ ప్రజలు ఈ అంగభాగాలను కడిగేందుకు ప్రత్యేకం యెడమ చేతిని కేటాయించారు. ముఖ్యంగా బహిష్టుస్రావం వెలువడే సమయంలో దుర్గంధం జనించి నలుగురికీ జుగుప్సని కలిగిస్తుందన్న భయంతో బహిష్టయిన స్త్రీలు నాల్గుగోడల మధ్య తమని తాము బంధించుకోపటం ఆచారమైంది. బహిష్టునే తెలుగు వాళ్ళం "ముట్టు" అంటున్నాము. ముట్టు అంటే Touch అని అర్థం. ముట్టు స్త్రీలను ముట్టకూడదన్న నియమం మనకెక్కువ. ముట్టుగాలి తగిలితే మొక్క కూడా మాడిపోతుందన్న సమ్మకం మనలో జాస్తిగా వుంది.

**మూత్ర విసర్జకాంగం కన్నా మలవిసర్జకాంగం మరీ జుగుప్సాకరం గదా! పరాయివాడు ఎదరపడివున్నప్పుడు జననేంద్రియాన్నే మూసుకుంటారుగాని, వెనుక భాగాన్ని మూసుకోరు యెందుచేత?**

కొన్ని జాతుల స్త్రీలు సిగ్గుపడినప్పుడు కట్టుకొన్న గాగరతో ముఖాన్ని కప్పుకొని విసర్జకాంగాలన్నిటినీ గాలికి విడిచిపెడతారు. వారికి ముఖమే కామకేంద్రం. వారి ఆచారమది; ఆయాజాతులు రక రకాలుగా ఆయా అంగాలకు ప్రాధాన్యత నిచ్చాయి. ప్రపంచంలో కొన్ని అనాది జాతులవారు ఆకులతో అంగాన్ని కప్పకుండా పృష్ట భాగాన్ని మాత్రమే కప్పుతారు. వాళ్ళకి ఆ భాగమే అసహ్యించుకోదగింది. ఒరియా వారికి పూర్వం అశ్వముఖులని పేరు. వారి ముఖమే సాంఘికమైన అసహ్యానికి గురి అయింది. కనుక వారు ముఖాన్ని కప్పుకోవటం జరుగుతోంది.

**● స్త్రీ పురుషుల జననేంద్రియాలు మూత్ర విసర్జకావయవాలే గదా? పురుషులకన్నా స్త్రీలే ఎందుకు సిగ్గుపడతారు?**

పురుషాంగం మూత్రాన్ని, వీర్యాన్నీ బహిష్కరిస్తుంది. స్త్రీ అంగం శ్లేష్మాన్నీ, మూత్రాన్నీ బహిష్టు స్రావాన్నీ విసర్జిస్తుంది. పైగా పురుషాంగాన్ని గ్రహిస్తుంది. అందుకే పురుషులకన్నా స్త్రీ లెక్కువ సిగ్గుపడతారు.

మరో చిత్రం ఏమంటే స్త్రీ పురుషులు ఉభయులూ తమ జననాంగాల పరీక్షకన్నా పురీషద్వార పరీక్షకి సుతలామూ అంగీకరించలేరు. వైద్య పరీక్షలో జననేంద్రియాలను డాక్టరుకు చూపించవలసి వచ్చినపుడుమానసికంగా ఇబ్బంది పడటం సహజమే. అదే పురీషద్వార పరీక్ష అయితేఇంక యే మాత్రమూ అంగీకరించలేరు. అనగా విసర్జకాంగాలు అసభ్యమైనవన్న దృష్టితోనే పురీష ద్వారానికి జననేంద్రియంకన్నా యెక్కువ ప్రాధాన్యత యివ్వటం జరిగింది.

స్త్రీలల్లో యోని పురీషద్వారానికి చాలా దగ్గరగా వుంటుందనిగ్రహించండి. ఇంచుమించు రెండు కలిసినట్లే వుంటాయి. పురుషులకట్లాకాదు. రెండూ విడివడి దూరంగా వుంటాయి కనుకనే పురుషులకన్నా స్త్రీలకు సిగ్గు ఎక్కువ.

కొత్తగా పెళ్ళిచేసుకున్న స్త్రీ తన పురుషుడికి నగ్నంగా తననిఅర్పించుకునేందుకు సిగ్గుపడుతుంది; అవమానపడుతుంది. భగవంతునిసృష్టిలో పురుషాంగం ప్రత్యేకం రతికోసమే నిర్ణయించబడి, మూత్ర విసర్జకాంగం వేరుగానున్నట్లయితే, దానికితోడు స్త్రీల యోని, బీజవాహికలు రొమ్ముల మధ్య నిర్మింపబడి వుంటే దాంపత్యానికి స్త్రీలు యింత ఎక్కువగా సిగ్గుపడకపోదురేమో! పెద్దవంశంలోని స్త్రీలు ఏదైనా కురుపువేసినా వారాప్రాంతాన్ని కనీసం పేరు పెట్టి చెప్పలేరు. ఆసనం అని, పొత్తికడుపుక్రింద అని-ఇలా వంకరగా మాట్లాడతారు. ఇంత అవమాన పడవలసిన విషయంఏమీ లేదని గ్రహించాలంటే యెంతో విజ్ఞానం అవసరం.

ప్రేమ అషామాషీ వ్యవహారం కాదు. యెంతో త్యాగంతో కూడుకొన్న

పని. పరస్పరం నగ్నంగా దంపతులిద్దరూ కలిసినప్పుడు అసహ్యాం పుట్టవచ్చు; భ్రమలు తొలగిపోవచ్చు. శరీర నిర్మాణంలోని దోషాలు కొట్టవచ్చినట్లు కనిపించవచ్చు పశుత్వమో, జడత్వమో ప్రాప్తించవచ్చు. సాంప్రదాయం దెబ్బతినవచ్చు. కనుక ఇలాంటి ప్రమాదాలను తెచ్చుకోకుండా సమస్తాన్నీ గోప్యంగా ఉంచటంలో అందమూ, ఆనందమూ, ఆకర్షణా ఉన్నాయి. తన అందంమీద, వొంపులమీద, హొయలుమీద, మీద నమ్మకమున్న నవ్వులయే స్త్రీగాని, తాను పురుషుల హృదయంపై, మనస్సుపై, నరాలపై ఎలాంటి ప్రభావం కలిస్తున్నదో గ్రహించగలదు. అందుకే స్త్రీలు అందానికీ, అలంకరణకీ ప్రాధాన్యత యిస్తున్నారు. అట్టి ఆకర్షకగుణమే లేని స్త్రీలు, గోప్యత ఎరుగని స్త్రీలు స్త్రీత్వాన్నేకోల్పోయినట్లు.

ఆధునిక నాగరికతలో స్త్రీలకు ఇవన్నీ తెలియవు. అయినా ఇవి వారి రక్తంలో జీర్ణమై యున్నవి. దాంపత్య సుఖాలను, సంతోషాన్నినిర్మించుకోదలచిన స్త్రీ మాత్రం అలంకరణకి ఎక్కువ ప్రాముఖ్యతనివ్వక తప్పదు.

ఇంచుమించు ప్రపంచమంతటా నానాజాతులవారు మంచి నాగరిక దశలో కూడా కామాంగాలను, సంధానాన్నీ చూడనిచ్చేవారు కాదు. అలాంటి విగ్రహాలను కూడ చూడకూడదు. స్త్రీ పురుషుల జననాంగాల పేర్లను కూడా ఉచ్చరించడానికి వీలులేదు: అవి అంత పవిత్రమైనవని వారి అభిప్రాయం.

అలపన్ నివాసులు పళ్ళుచెట్లమీద యోని బొమ్మను చెక్కుతారు. దానివలన ఆ చెట్టు యెక్కువగా ఫలిస్తుందని, దొంగలెవరైనా ఆ చెట్టు కాయలు కోసినట్లయితే దానివల్లవారికి అరిష్టం కలుగుతుందని నమ్ముతున్నారు. సింహళంలో శిశ్నాన్ని పూజించే ఆచారముంది. రతి పవిత్రమని వారి విశ్వాసం. కనుక ఎవరి కళ్ళు పడకుండా, కనీసం భార్య కళ్ళన్నా పడకుండా దాచుకుంటారు. భార్య కూడా చూడగూడదు. స్పర్శించ కూడదు. రతికి అర్థించకూడదు. కాని భర్తకోరికను మాత్రం అడిగినంతనే కాదనకుండా తీర్చాలి.

ఆటవిక జాతులవారు, బర్బరజాతులవారు నీచదేవతల్ని పూజిం చేటప్పుడు మలవిసర్జన కూడా అవసరమని నమ్ముతారు.

భోజనం చేసేటపుడుగాని, మంచినీళ్ళు త్రాగేటప్పుడుగాని మరొకరు చూడగూడదని కొందరి నమ్మకం. దీనికి కూడా సిగ్గే కారణం.

హెబ్రూ జాతివారి ధర్మశాస్త్రం ప్రకారం బహిష్టయిన స్త్రీ వొంటిపై వస్త్రాన్ని ఎవడైనా తొలగించినట్లయితే-చివరకు భర్తయినాసరే వారి ఉభయుల శిరస్సుల్ని ఛేదించాలి. అనాగా హెబ్రూజాతివారు బహిష్టును చూసిఎంత భయపడుతున్నారో అర్థమవుతున్నది.

**● మహమ్మదీయ స్త్రీలు యెందుచేత పరదాలను ధరిస్తున్నారు? దానికి సిగ్గేకారణమా?**

మహమ్మదీయులు ముఖాన్ని తలనీ కప్పుకోవడం సిగ్గువల్లనే అయినప్పటికీ మరో దృష్టితో జరుగుతున్నది. ఈ ఆచారం కేవలంమహమ్మదీయులకే కాదని గ్రహించండి! మహమ్మదు పుట్టక పూర్వం నుంచీవుంది.

హటెంటాట్‌జాతి స్త్రీలు తమ శిరస్సుకు ఎత్తుగా గుడ్డను చుట్ట బెడతారు. ప్రాణాలనన్నా విడిచిపెడతారుగాని, ఈ గుడ్డ తొలగించరు. అరేబియాలో అనాదికాలంలో పురుషులు మేలిముసుగులు ధరించేవారు. ఈజిప్టులోనూ, ప్రాచీన భారతదేశంలోనూ పురుషులకు కూడా ఘోషా ఉండేది. నేటికీ ఈజిప్టులో మిగిలివున్నది. దిష్టి తగులుతుందన్న భయమేదీనికి ముఖ్యకారణం. టువారగా జాతి పురుషులు మేలిముసుగులు ధరిస్తారు. అదే జాతి స్త్రీలు ధరించరు. బెంగాలీ స్త్రీలు, యూదు స్త్రీలు తలను కప్పుకుంటారు. వారికి కేశఖండన జరగదు. మేలి ముసుగు లేకుండా ఉండేవారు వేశ్యలుగానే లెక్క. అకారణంగా విడాకులు తీసుకొన్న సందర్భాలు కూడా ఉన్నాయి. వ్యభిచార స్త్రీలకు గుండు గొరిగి మేలి ముసుగు తొలగించటమే శిక్షగా విధించేవారు.

**● నేడు గౌనులు, బాడీలు మాత్రమే తొడుక్కునే ఇంగ్లీషు జాతి స్త్రీలకు మేలిముసుగు ధరించే ఆచారం ఉండేదా?**

ఆహా! 1846 సం॥ ప్రాంతంలో ఇంగ్లాడులోని మధ్యతరగతి స్త్రీలు ముఖ్యంగా సనాతన ధర్మాన్ని పాటించేవారు. విధిగా మేలిముసుగు ధరించేవారు. నేటి బెంగాలీ స్త్రీలవలె మేలిముసుగు లేకుండా ఎవరికంటన్నా పడితే, పెద్ద నేరం చేసినట్టు హడలిపోయి ఇటూ అటూ పారిపోయేవారు (**అలగ్జాండర్ వాకర్ : అందం. పుట 15**) నేటికీ ఫ్రాన్సులోనూ, బ్రిటానీలోనూ ఈ ఆచారం వుంది. మతరీత్యా ప్రతీ ఆదివారం రోజునా ప్రార్థన జరిపే టప్పుడు క్రైస్తవులంతా మేలిముసుగు ధరించవలసిందే.

- **దంపతుల మధ్య సిగ్గు ఏ స్థాయి వరకూ పెరిగింది?**

పెళ్ళయిన కొత్తలో వధూవరులిద్దరూ ముఖాముఖాలు చూసుకోరు. సిగ్గుఅడ్డం వస్తుంది. ఈ సిగ్గు కామ సంబంధమైనది. ఏదో తప్పుపని, అవమానకరమైన పని చేస్తున్నామన్న అభిప్రాయంతో వెలువడ్డ మనస్థితి యిది! శోభనమైన చాలాకాలం దాకా దంపతులిద్దరూ కారు చీకట్లో కాపు రాలు చేస్తారేగాని, ఒకరి ముఖాలు ఒకరు చూసుకోరు. మగాళ్ళు బాగా చీకటిపడే దాకా వధువు గదిలోకి వెళ్ళరు. తెల్లారకుండానే ఆ గది లోంచి చక్కావస్తారు. భార్యాభర్తలు ముఖ ముఖాలు చూసుకోకుండానే పిల్లల తండ్రులైన ఉదంతాలు చాలా వున్నాయి. భర్తకి గదిగుర్తేగానిగదిలోమనిషి గుర్తు వుండదు. ఒక్కొక్కప్పుడు భర్త మారినా భార్యకు తెలియనేతెలియదు.

బాలర్ దీవుల్లో వరుడు వధువుకోసం చీకట్లో తుడుముకోవలసిందే.

దక్షిణాఫ్రికాలో పెళ్ళితంతు పూర్తయ్యేదాకా వరునికి వధువుని చూపించరు.

పెర్షియాలో శోభనమయ్యేదాకా భార్యను చూడటానికి వీలులేదు.

దక్షిణ అరేబియాలో వధూవరులిద్దరూ కదలకుండా రెండు వేర్వేరు గదులలో మిట్టమధ్యాహ్నం నుంచి అర్ధరాత్రి వరకూ కూర్చోవాలి. ఆసమ యంలో మంచినీళ్ళన్నా త్రాగకూడదు. వధువుచుట్టూ స్త్రీలు, వరునిచుట్టూ పురుషులూ కూర్చుని ఉంటారు. నాల్గవరోజు రాత్రిగాని వాళ్ళిద్దరూచూసు కోవటం జరగదు.

ఈజిప్టులో స్త్రీలకు మేలిముసుగు తొలగించటమే వివాహం.

మొరాకోలో పెళ్ళిముందు విందుచేస్తారు. వధూవరులిద్దరూ ఆ విందులో ప్రత్యేక ఆసనాలమీద కూర్చుంటారు. అంతసేపూ ఆ పిల్లకళ్ళు మూసుకు కూర్చోవలసిందే. పైగా విగ్రహంలా కదలకుండా కూర్చోవాలి. మరునాడు వివాహం. చీకటిపడ్డాక దీపాలు పట్టుకొని వధువుని వరునింటికి తీసికెడతారు. ఆమె కళ్ళుమూసుకు నడవాలి. ఇద్దరు స్త్రీలు ఆమెను పట్టుకు నడిపిస్తారు. మరొకామె తలపట్టుకుంటుంది.

ఆమె శోభనం గదిలో మంచం మీద కూర్చున్నంతవరకూ కళ్ళు విప్పి చూడ కూడదు. మేలిముసుగు ధరించే వుండాలి. అంతవరకూ ఒక స్నేహితురాలు కూడా పక్క పక్కనే ఉంటుంది.

మెలినీషియాలో వధువును చాపల్లో చుట్టి వీపుకు కట్టుకొని యెవరో ఒక ఆసామీ వరుని యింటికి తీసుకొచ్చి పడేస్తాడు. వధువు ముఖానికి తాటాకులు అడ్డం పెట్టుకుంటుంది. సిగ్గు!

కొరియా, మంచూరియా, చైనా, రష్యా, బర్మా, బల్గేరియా, పెర్షియా, ఇండియా వంటి అన్ని దేశాలలోనూ ఈ సిగ్గూ మేలి ముసుగూ వున్నాయి.

తెనుగుదేశంలో పూర్వకాలపు పెళ్లికూతురు పెళ్ళిపేరు చెపితేనే లేడిపిల్లలా చెంగున ఊరిపొలిమేరదాకా పడిగెట్టేది. పల్లకిలో బుర్ర వంచుకోవలసిందే. కన్నెత్తి మగణ్ని చూడకూడదు. పెళ్ళినాడే వాళ్ళిద్దరి మధ్యా తెరతీయటం! పెళ్ళి కూతుర్ని మేనమామ బుట్టలో పెట్టి తేవలసిందే.

ప్రపంచ ఆచారాల మూల సూత్రాలన్నీ వొక్కటే అనిపై ఉదంతాలని బట్టి తేలుతుంది.

● **యింతకీ పెళ్ళి విషయంలో స్త్రీ యింత సిగ్గుపడవలసిన అవసరం ఏమిటి?**

శోభనం స్త్రీ జీవితంలో చాలా గొప్ప మార్పు తెస్తుంది. ఒక విధంగా ఆమెకిది తియ్యని భయంకర స్వప్నం. భర్త ఆమె దృష్టిలో దోపిడిగాడు;

చాలా ప్రమాదకరమైన మనిషి. ప్రమాదకరమైన మనుష్యుల్ని చూడటం కూడా ప్రమాదమే; భర్త కళ్ళు తన మీద పడటమే తనకు ప్రమాదమన్న భావంతో, తాను యెంతో అపరూపంగా దాచుకున్న కామాంగాలను కొల్లగొట్టేవాడు యెదుట పడ్డాడన్న భీతితో, నలుగురిలోను తాను అల్లరి పడనున్నానన్న అవమానంతో, ఆగండం ఏ క్షణంలో మీద పడుతుందోనన్న భయంతో ఆమె అట్లా తయారవుతుంది.

**● వస్త్రధారణకి సిగ్గుకి సంబంధం ఉంటుందా?**

లేదు. వస్త్రాలనూ, నగలనూ ధరించక పూర్వమే మానవజాతి సిగ్గు పడటం నేర్చుకుంది! విసర్జకాంగాలమీద అసహ్యం కొద్దీ వస్త్రాలను ధరించింది. కామాంగాల మీద అభిమానం కొద్దీ నగలతో అలంకరించింది. అవి ఆకర్షక కేంద్రాలుగా ఎంచి మరింత ఆకర్షణీయంగా తయారు చేయటం కోసమే, నగలను, ఆ తర్వాత కాలంలో వస్త్రాలను ధరించ నేర్చింది.

సిగ్గు కేంద్రాలు కూడా అన్ని జాతుల స్త్రీలకూ ఒకే చోట లేవు. దక్షిణాది స్త్రీ లందరికి రొమ్ములే సిగ్గు కేంద్రాలు. నగ్నంగా వున్న స్త్రీలు మగవాళ్ళ కళ్ళపడినప్పుడు ఒకచేతిలో యోనిని మరోచేతితో రొమ్ముల్ని కప్పుకుంటారు. వీనస్ గ్రీకుల కామదేవత. ఆమె విగ్రహం ఇలాగే చెక్కబడింది. యూరోపియనులకు కూడా ఇవే సిగ్గు కేంద్రాలు.

ఒరియా స్త్రీలకు ముఖమే సిగ్గు కేంద్రం. నగ్నంగా పురుషునికంట బడినప్పుడు ఒరియా స్త్రీలు రెండు చేతులతోనూ ముఖాన్ని కప్పుకుంటారు.

చైనా స్త్రీలకు పాదాలు సిగ్గు కేంద్రాలు. జోళ్ళు లేని పాదాలు పురుషుల కళ్ళబడితే ఆ స్త్రీలకు ప్రాణం చచ్చిపోతుంది. భర్త తప్ప యెవ్వరూ చైనా స్త్రీపాదాలను నగ్నంగా చూడటానికి వీలు లేదు.

ఆఫ్రికా స్త్రీలకు పిరుదులే సిగ్గు కేంద్రాలు. నగ్నంగా పురుషుని కళ్ళబడ్డ నీగ్రో స్త్రీ రెండు చేతులతోనూ పిరుదుల్ని కప్పుకుంటుంది. అంతే కాని ముందు భాగాన్ని కప్పుకోదు. నీగ్రో స్త్రీలలో యోని బాగా అడుగున

ఉండటంవల్ల వారిని వెనుక నుంచి సంధానించే అలవాటు ఉండటం కారణం కావచ్చును. దానికితోడు తొడలు రెండూ కలిసే చోట నీగ్రో స్త్రీ చాలా ఆకర్షణగా వుంటుంది. అందుకే అనాది నీగ్రో స్త్రీలు పిరు దులకే ఆకు అలముల్ని కప్పి యోని భాగానికి ఏ అచ్ఛాదనా లేకుండా వదిలి వేస్తారు.

**● నాటికీ నేటికీ సిగ్గులో మార్పేమన్నా వచ్చిందా?**

వచ్చింది. నాటిసిగ్గు పురుషుల ప్రమాదకర చర్యలనుండి రక్షించు కోవటం కోసం ఉద్దేశింపబడింది. నేడు అలాంటి ప్రమాదమేదీ లేదు కనుక పురుషుల్ని ఆకర్షించు కోవటం కోసమే సిగ్గు ఏర్పడింది. అందుకే అధునిక స్త్రీ పదిమార్లు పమిట జాడించి సిగ్గు కేంద్రాలను కామకేంద్రాలుగా ప్రదర్శిస్తుంది. నేటి సిగ్గు కొంటెతనానికి తార్కాణం.

**● తన బలహీనత నలుగురికీ అసహ్యాన్ని కలిగిస్తుందేమో నన్న భయాన్ని స్త్రీ ఎలా పోగొట్టుకుంది?**

వస్త్రాలనూ నగలనూ ఆమె ఆకర్షణ పత్రాలక్రింద మార్చుకుంది. అందహీనమైన భాగాలకు అందం చేకూర్చేలా వాటిని అమర్చుకుంటూ పురుషుల్ని ఆకర్షించటంకోసమే ఆమె శతధా ప్రయత్నించింది. మూతవేసి ఆకర్షించటం నాగరిక పద్ధతి అయింది. ఎంతదాస్తే అంత ఆకర్షణ! ఎంతటి మనిషి రెచ్చిపోవాలి! యీ విధంగా నచ్చని వస్తువుల్ని మెచ్చేటట్టు చేసుకోవటం చేతనయింది.

**● జననాంగాలకు నగలు పెట్టుకునే స్త్రీ పురుషులు ఎక్కడన్నా ఎప్పుడన్నా ఉండేవారా?**

దక్షిణ ఆస్ట్రేలియాలో కొన్నా జాతులవారు, చలితో పణికత్తి చచ్చినాసరే బట్టలు తొడుక్కునేవారు కాదు. మెడనిండా పూసలపేర్లు వుంటాయి. తలచుట్టూ పూలదండలు చుట్టుకునేవారు. మొలకు జుట్టుతోనే మొలత్రాడు గట్టి యోని మీద వస్త్రపటాన్ని వ్రేలాడగట్టేవారు పురుషులు ఆపాటి కూడా మర్మాంగాలను దాచుకునేవారు కాదు, పైగా తెల్లని పింగాణీ మట్టితో అంగానికి రంగుపూసి పదిమందిలోనూ పూసుకు

తిరిగేవారు. అందర్నీ ఆకర్షించటానికీ అదో పద్ధతి.

పసిఫిక్ దీవులలో అనాది తెగల పురుషులు యవ్వన కేశాలనుతొల గించకుండా చక్కగా జడలల్లి పువ్వులు పెట్టేవారు. ఆ భాగాలను స్త్రీ పురుషులిద్దరూ పోటాపోటీగా నగలతో అలంకరించుకోవటం పరిపాటి, బట్టల్ని యెవరూ ధరించేవారు కాదు.

(-రె. ఆర్. ఫోర్స్టర్)

**• వస్త్రధారణ విషయంలో ఆసియా దేశాల స్త్రీకి, యిరోపా దేశాల స్త్రీకి తారతమ్యం ఏమిటి?**

ఆసియా దేశాల స్త్రీ తన అంగాలను కప్పుకోవటానికి వస్త్రాన్ని ధరిస్తే యిరోపా దేశాల స్త్రీ తన అంగాలను ఆకర్షణీయంగా ప్రదర్శించటానికే వస్త్రాలను ధరిస్తుంది. నేటి ఆసియా దేశపు స్త్రీ స్థాయిని నేటి యిరోపా స్త్రీ యేనాడో అధిగమించింది. నేటి ఆసియా స్త్రీ కూడా యిప్పుడు యిరోపా స్త్రీని అనుసరిస్తోంది.

ఏది యేమయినప్పటికీ కాలక్రమేణా వస్త్రధారణవలన ఆత్మ గౌరవమూ, హుందా, కామపరమైన ఆకర్షణ స్త్రీ పురుషులకు లభించాయి. గుడ్డలు విప్పటమంటే మనిషిని అవమానించట మయింది. ద్రౌపదీవస్త్రా పహరణం అలాంటిదే. నాటికి రాజాస్థానాల్లోని దాసీలందరూ నగ్నంగానే ఉండేవారు. రాణులకే వస్త్రధారణ హక్కు. జూదంలో వడ్డబడి ద్రౌపది దాసీ అయినది. కనుక ద్రౌపదిని వివస్త్రను చేయవలసి వచ్చింది.

దాసీలకి రాణులకి వస్త్రమే భేదం కావటంతో వస్త్రానికి సాంఘిక విలువ పెరిగింది. సంఘంలో ఉన్నతికోసం అందరూ వస్త్రధారణకే యెగ పడ్డారు.

ఆడది బట్ట కట్టుకోవటం నేర్చుకోగానే ఆమె సిగ్గు స్థాయి, ప్రాము ఖ్యత పెరిగాయి. సమాజంలో ఆడది కూడా వాడకం వస్తువుగా పరిగణిం చబడింది. సంఘంలో పశువులతో బాటు స్త్రీలను కూడా సమానంగా చూడసాగారు. అనగా ఆడది కూడా మగవాడి ఆస్తిక్రింద పరిగణింపబడింది.

చాలాకాలం వరకూ వివాహితలైన స్త్రీలే బట్టలు కట్టుకునేవారు అవివాహితలైన వారు, భర్తను పోగొట్టుకున్న వారు వివస్త్రలుగానే ఉండే వారు. ఈ స్త్రీలు స్వతంత్రులు (ఎవరితోనైనా కలిసే స్వేచ్ఛ గలవారు) గనుక వారు విధిగా వస్త్రాలను ధరించాలన్న నియమంలేదు. భర్తల అసూయవల్లనే భార్యలు బట్ట కట్టుకోవలసి వచ్చింది. ప్రపంచంలోని కొన్ని చోట్ల మగవాళ్ళు నగ్నంగా ఉన్నప్పటికీ వారి భార్యలు బట్టలు ధరిం చటం వుంది. మగవాళ్ళు బట్ట కట్టుకోవటం ఆడతనంగా, అవ మానంగా భావించి కృంగిపోయేవారని తెలుస్తున్నది.

(మాంటిగెజ్జా)

"వివాహం కానంతకాలం స్త్రీ చాలా స్వేచ్ఛగా ఉంటుంది. పవిత్రంగా ఉండవలసిన అవసరం లేదు. పైగా యే ఆచ్ఛాదనా లేకుండా బుద్ధి పుట్టి నప్పుడల్లా తిరగవచ్చు; పెళ్ళయినా తర్వాత ఆమె విధిగా బట్ట కట్టు కోవాలి, తన ఇష్టం వచ్చినట్లు తిరగటానికి వీలులేదు.

తన ఆస్థిని యితరులు కొల్ల గొట్టుకోకుండా తన భార్యకుఉడుపులు తొడగటం వలన నైతికంగాను, శారీరకంగాను కొంత రక్షణ ఏర్పడిందని ఆమె భర్త అనుకుంటాడు.

ఈ విధంగా, స్త్రీ నగ్నత్వాన్ని శాశ్వతంగా అవమానకరమైన విష యం గా తయారుచేయటానికి అనుకులమైన స్వార్థచింతన పురుషులలో ప్రవేశించింది. ఐర్లెండులో పెద్దవంశాల స్త్రీలు 17 వ శతాబ్దం వరకూ నగ్నంగా ఉంటూ తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకున్నారు.

20 శతాబ్ది ప్రారంభం వరకూ, ఇంకా అక్కడక్కడ నేటికీ, కూడా కేరళ స్త్రీలు అర్ధ నగ్నంగానే ఉంటారు. ఇంచుమించు అజంతా చిత్రాల వలె, నేటి ఆఫ్రికాదేశాల స్త్రీలవలె నడుమువరకే బట్ట చుట్టబెట్టు కుంటున్నారు.

**● అయితే కన్యలకున్న యీ స్వాతంత్ర్యం యెప్పుడు పోయిం దంటారు?**

స్త్రీ పవిత్రతకు పేరు రావటం ప్రారంభించాక, కన్యలకు కూడా పవిత్రత అవసరమైంది. చిన్ననాటి నుంచి బట్ట కట్టుకొన్న కన్యకు "డిమాండు" పెరుగసాగింది. మార్కెట్టులో వాళ్ళగిరాకీ యెప్పుడైతే పెరిగిందో అప్పుడే కన్యలు తండ్రికి కూడా ఆస్తిగా మారిపోయారు. ఒక్కొక్క ఆడపిల్ల బోలెడు కన్యాశుల్కాన్ని తెచ్చిపెట్టేది. కనుక కనకం కణకణ లాడటంతో తండ్రే తన అవివాహిత కుమార్తెల మాన సంరక్షకుడయ్యాడు.

చిన్నప్పుడు తండ్రి, తరువాత భర్త, ఆ తరువాత కొడుకు అధీనంలోనే స్త్రీ ఉండాలని, కావున "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని హిందువులను మనువు శాసించాడు. అప్పటికాలో పశ్చిమ తీరమందు కూడా ఈ ధర్మ సూత్రమే అమలులో వుంది. 17 వ శతాబ్దం వరకు క్రైస్తవ మతం కూడా యిదే అభిప్రాయాన్ని ప్రచారం చేస్తూ వచ్చింది.

**● సిగ్గు వలన ఆర్థిక లాభాలు కలగడంతో సంఘంలో ప్రత్యేకమైన మార్పు లేమన్నా వచ్చాయా?**

స్త్రీ ఎప్పుడైతే వ్యక్తిత్వాన్ని పోగొట్టుకుందో అప్పుడే పురుషుని ఆస్తిగా మారిపోయింది. అప్పుడే సిగ్గు స్త్రీలకు భూషణమైపోయింది. పైగా నీతి శాస్త్రరీత్యా దానికంతో ప్రాధాన్యత యేర్పడింది. ఒక స్త్రీ శీలం ఒక పురుషుని ఆస్తి అయినప్పుడు మరొక పురుషుడు ఆమెచే ఆకర్షింపబడి భర్తగారి ఆస్తి హక్కుల్ని భంగం చెయ్యకుండా ఉండటంకోసం స్త్రీలు తీవ్రంగా సిగ్గు పాటించవలసిన అవసరం ఏర్పడింది. పరపురుషుల దృష్టి నుండి తప్పించుకోవటం కోసమే స్త్రీలను మరుగుపరచటం అవసరమైనది. పురుషులను రెచ్చగొట్టే సిగ్గే పురుషుల దృష్టి నుండి స్త్రీ కప్పుకునే సాధనంగా తయారయిందన్నమాట! సిగ్గుమాలిన ఆడదాన్ని యే పురుషుడూ క్షమించలేడు. ఆమెను భర్తయేగాక సమస్త బంధువులూ పరిత్యజించి తీవ్రంగా బాధించేవారు. 14వ శతాబ్దంలో ఇంగ్లాండులో వెలుపడిన గ్రంథంలో నీతి వాక్యం ఉంది. "స్నానం చేసేటప్పుడు, బట్టలు కట్టుకునేటప్పుడు ఏ స్త్రీ గాని రహస్య ప్రదేశంలోనే ఉండాలి. గొప్ప

కోసం గాని లేక పురుషుల్ని ఆకర్షించుకోడంకోసం గాని జుట్టూ, మెడా, రొమ్ము వంటి ఏ భాగాన్నీగాని ప్రదర్శించకూడదు'' పురుషుల జారినుండి తమ శీలాన్ని కాపాడుకోవటం కోసమే స్త్రీలు బట్టల్ని ధరించటం అవసరమైంది.

అయినప్పటికీ అలాంటి కట్టుబాట్లన్నీ విడిచి అప్పుడప్పుడు స్త్రీ పురుషులంతా నగ్నంగా జలక్రీడ లాడుకోవటం కద్దు.

**● మొన్న మొన్న వీరేశలింగంగారి వరకు మన సాహిత్యంలో అంగశృంగారం చాలా అధికంగా ఉండేది, ఎందుచేతనంటారు?**

భారతదేశంలో నాగరిక పరిణామం తొందరగా జరగలేదు. ముఖ్యంగా మనదేశం వ్యవసాయ దేశం కావటమే కారణం. అందులోనే సమస్త సంపదలనూ గుణించి తులతూగేది. ఇంగ్లాండు వంటి దేశాలు కాపు గనుక ఆయాదేశాలలో బర్బర నాగరికత అట్టేకాలం వర్ధిల్లటానికి గాని, సంపూర్ణ స్వరూపాన్ని పొందటానికిగాని, అవకాశం లేకుండా పోయింది. కామ స్వాతంత్రం ఆ దేశాల్లోని స్త్రీలు కున్నప్పటికీ అనతికాలంలోనే పారిశ్రామిక విప్లవం ఏర్పడటం వలన ఈ రకం అంగశృంగారం పాశ్చాత్య సాహిత్యంలోకి అంతగా ప్రవేశించలేదు. మన దేశానికున్న చరిత్ర స్థిమితం సిరిసంపదలు– ఆ దేశాలకు ఆ రోజుల్లో ఉన్నట్లయితే వారి సాహిత్యం కూడా మన ప్రబంధాల ధోరణిలోనే ఉండేది.

ఆ కాలంవారికందరికి శరీరసుఖమే ప్రమాణం. ఎంతో ఉత్సాహంతో పాల్గొనేవారుకాని, కాలక్రమేణా క్రైస్తవ నీతి స్త్రీ పురుషుల మధ్య సాన్నిహిత్యాన్ని పాపంగా పరిగణించటంతో పరిస్థితులు తారుమారయ్యాయి. స్త్రీ ప్రకృతికి అందాన్నీ, నాజూకుతనాన్ని, పెలుయల్నీ, వయ్యారాన్నీ అంటగట్టి వారిని పురుష ప్రకృతి నుంచి దూరం చేశారు. ఆ పరిస్థితుల్లో అది అవసరంగానే తోచినప్పటికీ శాశ్వతంగా స్త్రీ పురుషుల మేలు కలయిక నుండి స్త్రీలను యేకాకుల్ని చేసివేసింది.

ఆ ప్రభావమే మనపై కూడా క్రైస్తవ పాలకులనుండి ప్రసరించింది. నాగరికతతోబాటు కాలక్రమేణా నాజూకుతనం ప్రవేశించి మోటు

తనాన్ని పరిహరించనేర్పింది. ఈ మార్పును భాషా సాహిత్యాలలోవిశదంగా చూడగలం.

**● మానవ ప్రవర్తనలో వచ్చే మార్పు భాషాసాహిత్యాలలో యెందుకు ప్రవేశించాలి?**

ప్రవర్తన కేవలం భౌతికమైనది. యెవరి ప్రవర్తనలోనైనా మార్పు వచ్చిందంటే వారి మనస్థితిలో కూడా మార్పు వచ్చిందనే అర్థం. మనస్సు మారితేగాని ప్రవర్తన మారదు, అవునా! సంస్కృతి మారితేగాని మనస్సు మారదు. ఆటవిక సంస్కృతి, బర్బర (వ్యవసాయిక) సంస్కృతికీ మధ్య యెంతో భేదం వున్నట్లే, బర్బర సంస్కృతికీ నాగరిక సంస్కృతికీ మధ్య భేదం వున్నది. ఆటవిక సంస్కృతిలో భాషకీ, వేషానికీ నగిషీలువుండవు. నిర్మలాంతఃకరణతో మరగూ, తరా లేకుండా ఉన్నదున్నట్లు అనేవారు. అనుభవించేవారు. బర్బర సంస్కృతిలో తరలూ, తరమరుగులూ వచ్చినా అంతఃకరణలో మార్పురాలేదు. నాగరిక సంస్కృతి భాషలో కూడా భేషజం తెచ్చింది.

**● భాషలో భేషజమంటే యేమిటి? అది యే రూపంలో ఉంటుంది?**

స్విఫ్ట్, స్టెర్నువంటి రచయితల వాక్యాలు సిగ్గుపడటం ప్రారంభించాయి. పొట్టి వాక్యాలు...గీతలు, సెమికోలన్లు, లాలిత్యంకోసం ప్రాకులాటలు-అన్నీ ఆవిర్భవించాయి. అంతకు ముందు వాళ్ళు అలాంటి ట్రిక్కులూ టక్కులూ ఎరుగరు.

నలుగురితోటీ స్నేహ సౌహార్ద్రాలు లేకుండా ఇంత ఉండటంవలన వంటెత్తుతనం అలవాటుండి, కూపస్థ మండూకాల్లా తయారైన సంపన్న స్త్రీలు జీవిత యదార్థాలను ఎరుగక, గ్రంథాలనుంచీ, నటుల నుంచీ నాజూకుసూ లాలిత్యాన్నీ సంగ్రహిస్తూ తద్వారా వినూత్న లోకడనునాగరిక జీవితంలో సృష్టించారు.

**● దీనివలన వారు సాధించిన లాభాలేమిటి?**

శరీరాన్ని మరుగు పరచినట్లే, అర్థాన్ని కూడా మరుగుపరచాలి

యీ మరుగు పరచటంలో అసలు పేర్లను వాడకుండా అదే అర్థమిచ్చే ప్రత్యామ్నాయ పదాలను వాడతారు. ముఖ్యంగా జననాంగానికీ, సంభోగానికి సంబంధించిన సమస్త విషయాలలోనూ ఈ ఉక్తి చమత్కారం కనిపిస్తుంది.

"పడిలో పెట్టనా, దడిలో పెట్టనా అంటూ రాత్రి మావారు ఇంటికి వచ్చేసరికి..." ఈరకం వ్యంగ్య వైభవం అనే వాళ్ళకీ వినేవాళ్ళకి చాలా ఆహ్లాదకరంగా వుంటుంది. జననేంద్రియాలకు ప్రజాసామాన్యం వాడుతున్న పేర్లను మనం వాడుతున్నామా? మనకు సభ్యత అడ్డుపస్తున్నది.

నాగరిక భాషలన్నింటిలోనూ ఈ చమత్కారాన్ని చూస్తున్నాము. అదే భాషకు పట్టిన సిగ్గు. ప్రబంధాల భాషకీ, వెంకటచలం భాషకీ తేడా లేదా?

**● వస్తువుకన్నా చెప్పిన విధానానికే నాగరికత ప్రాధాన్యత నిచ్చినట్లు దీనినిబట్టి అర్థమవుతుంది. కనుక నాగరికత వలన కవిత్వంలో కూడా పరిపూర్ణత యేర్పడిందంటారా?**

అవును. రచనలో అందమే కావ్యత్వం. అది వచనం కానివ్వండి. గేయంకానివ్వండి. దాని పరిపూర్ణత ముఖ్యంగా రొమాంటిక్ రివైవల్ ఉద్యమంలో, అనగా భావకవిత్వపు రోజుల్లో కలిగింది. గురజాడ అప్పారావుగారు, కందుకూరి వీరేశలింగంగారు మూలపురుషులుగా భావకవుల యుగంలో పరిపూర్ణత పొందింది. ఈ భావకవులలో కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ ప్రధానులు. పదలాలిత్యపు ముసుగు తొడిగి హిస్టిరాయిడ్ ఆవేశంలో దిగంతాల పులకరింపచేశారు. ఈవిధంగా భాషకు సమగ్రతను సాధించారు.

ఇంతవరకూ "సిగ్గు" అని చెపుతూ వచ్చిందంతా యదార్థానికి సిగ్గుకాదు నమ్రత (Modesty). ఇది కేవలం మానసికమైన అనుభూతిగా చిత్రించుకుంటూ ఇంతవరకూ చర్చిస్తూ వచ్చాము. అవమానం, భయం, పిరికితనం, చొరవలేకపోవటం, వినయం ఇవన్నీ ఈ నమ్రతలో ఇమిడి వున్నాయి.

అసలు "సిగ్గు" గురించి ఈసారి చెప్పుకుందాం. యీ సిగ్గును

"నమ్రత" అంగీకరించింది. పైగా మానసికానుభూతి (నమ్రత) వల్ల ఏర్ప డిన శారీరక ప్రకోపమే సిగ్గని గ్రహించండి. అనగా నమ్రత కారణ మైతే సిగ్గు కార్యమవుతుంది. ఈ రెండింటికీ కారణకార్య సంబంధంఉంది.

పైగా లైంగిక సంబంధాలకూ, సిగ్గుకూ (Blushing) సంబంధం ఉంది. ఈ రెండూ భార్యాభర్తల్లాంటివి. ముఖ్యంగా ఆడవాళ్ళే సిగ్గుపడాలి. వాళ్ళకోసమే సిగ్గు పుట్టింది. సమర్త ఆడే ముందు రోజుల్లో ప్రారంభించి సమర్తాడిన తర్వాత ఎక్కువై పిల్లల్ని కనేవరకూ ఉంటుంది. శోభనంతోతగ్గి పోవటం ప్రారంభిస్తుంది. స్తంభించటమే లింగానికి సిగ్గని స్టేన్లీహాల్ అన్నా డు. సిగ్గు వేసినప్పుడు ముఖంలో రక్తం పొడుచుకొస్తుంది గదా! అలాగే మగవాళ్ళ అంగంలోకినని ఆయన భావం. ఆడపిల్లలు నలుగురు కలిసి దూరంనించీ ఏవో చెప్పుకొని, గోళ్ళు, కొరుక్కుంటూ కిచకిచ లాడటం వలన లైంగికమైన వారి అవమానం విముక్తమవుతుంది. ఆది నుంచీ వచ్చిన కాముభయమే సిగ్గుగా చెప్పుకొనవచ్చు. ఒకవిధంగా సిగ్గువలన ఒళ్ళు జలదరించినా ఆనందమే కలుగుతుంది.

ఈ సమయంలో ముఖం ఎర్రబడుతుంది. ముఖకండరాలు సంకో చిస్తాయి. కనుక అది ఒక విధంగా భయమేనని చెప్పవచ్చు. ఆడదాన్ని ఏ మాత్రం స్తుతించినా సరే ఆమెలో ఈ అనుభూతుల్ని విస్పష్టంగా చూస్తా ము. అప్పుడు చూసేవాళ్ళకి ఆనందం కలుగుతుంది. చూడటానికి ఆ ముఖం అందంగా వుంటుంది. అదే ఆ మనిషిని ఆకర్షింపజేసి ఆ స్త్రీ పైకి పురుషుడు లంఘించేటట్లు చేస్తుంది. ఆ స్త్రీని నిరోధించకుండా నిల వేస్తుంది. ఈ విధంగా కామాన్ని ప్రేరేపించే శక్తి "సిగ్గు"లో ఉంది.

**● మగవాళ్ళు సిగ్గు పడటం మంచిదేనా?**

ఒక్కనాటికి కూడా మగవాళ్ళు సిగ్గు పడటం మంచిది కాదు. సిగ్గు ఆడతనాన్ని కలిగిస్తుంది. అతడు ప్రదాత, ఆమె గ్రహీత. కనుక అతను ఉల్లంఘించాలి. ఆమె గ్రహించాలి. సిగ్గువలన మగవాడికి చొరవపోతుంది. అదిపోతే అతని మగతనమే పోయినట్టు.

**● స్త్రీలకు సిగ్గు లేకుండాపోతే నష్టం వుందా?**

వుంది. స్త్రీత్వమే పోయినట్లు. స్త్రీలకు సమాన హక్కులు అన్ని విషయాలలోనూ అవసరమేగాని, దాంపత్యంలో మాత్రం కాదు. ఆమె ఎప్పుడూ పురుషునికి ఇన్‌ఫీరియర్‌గానే ఉండాలి. కనీసం ఉన్నట్లు నటించాలి. సిగ్గు కామానికి ఆహ్వానమని అంటున్నాము. సిగ్గు లేకపోతే కామానుభవంలో ఆనందం మృగ్యమై భయం ఎక్కువవుతుంది. ఆత్మ సంపర్కానికీ స్వజాతి సంపర్కానికి పూనుకున్న స్త్రీలు పురుషులంటేసిగ్గు పడరు. పైగా సిగ్గులేని స్త్రీ అంటే మగవాడే భయపడతాడు. అది తొలి రోజుల మాట! ఆ తర్వాత స్త్రీ కెలానూ సిగ్గు లేకుండా పోతుంది. పురుషుని కి కూడా ఏ విధమైన యిబ్బందీ ఉండదు.

**● భయానికి పర్యాయపదమే సిగ్గన్న అభిప్రాయం మీరు చెప్పారుగదా! దాన్నెలా బలపరుస్తారు?**

కన్యకు పెళ్ళిమాట ఎత్తేసరికి వచ్చే సిగ్గు శోభనంతో పోతుంది. నిదానించి నడవటం ధైర్యంగా ముందుకు రావటం నేర్చుకుంటుంది.

ఆమెకే ఒక బిడ్డ పుట్టాడనుకో! నలుగురి ముందు ఆమె రొమ్ము నందించి ఆ బిడ్డకు పాలివ్వగలదు. అదే ఆ బిడ్డ పుట్టకపూర్వమైతే దీపాలు ఆర్పకుండా భర్తకి అందివ్వదు. అదే శోభనానికి ముందు రోజుల్లోఅయితే తల్లి ముందు కూడా నగ్నంగా నిలబడదు.

**● ఎంత సిగ్గున్న స్త్రీ కయినా నగ్నంగా పురుషుని ముందు నిలబడటానికి అభ్యంతరం ఉండదంటారా?**

ఒక చిన్న ఉదాహరణ చెప్తాను. ఒకసారి ఒక ఆర్టిస్టు యింటికివచ్చి ఒకామె "మోడల్"గా కూర్చుంది. అంటే నగ్నంగా ఒకఫోజులో కూర్చోవట మన్న మాట! అలా కూర్చున్నందుకు ఆమెకు కొంత నగదు ప్రతిఫలం యిస్తారు. ఇలా ఉండగా ఆమె ఆకస్మాత్తుగా కేకపెట్టి లేచిపోయి గబ గబా చీర చుట్టబెట్టుకుంది. ఏమి ఉపద్రవం వచ్చిందా అనితెల్లబోయి,ఆ తర్వాత సముదాయించి అడిగేసరికి--రెండిళ్ళవతల డాబామీదనిలబడి

ఎవరోతనకేసి చూస్తున్నారని, అందుకే తన వొళ్ళు "చచ్చిపోయింద"ని చెప్పింది. అందుకే నగ్నత్వానికీ సిగ్గుకీ సంబంధం లేదని చెప్పటం.

విదేశాలలో రాయబారిగా ఉన్నాయన భార్య మామూలుగా పుట్టింటికి వచ్చినప్పుడు తోటివాళ్ళు నలుగురి మధ్యా తానొక్కర్తే జుట్టు కత్తిరించుకు ఉన్నందుకు ఎంత ప్రయత్నించినా కన్నీళ్ళు ఆపుకోలేకపోయింది.

దీనిని బట్టి చుట్టుపక్కలవాళ్ళ భావాలను, అనుభూతులనూ అనుసరించి మనలో ఈ నమ్రత ఏర్పడుతుందనీ, ఈ విధంగా అదిపరాయి వాళ్ళ చిత్త వృత్తులపై ఆధారపడుతుందనీ గ్రహించండి! ఒక్కో సందర్భంలో సిగ్గు కలగకపోయినంత మాత్రాన తప్పు స్త్రీది కాదు. ఆ స్త్రీ వైపు చూచేవ్యక్తి దృష్టిలో కామంగాని, కుతూహలంగాని, దోషారోపణగాని లేవని అర్థం. అలాంటివి మీలో ఏ మాత్రం ఉన్నా ఆ స్త్రీ చటాలున సిగ్గు పడుతుంది. తండ్రి దృష్టిలో ఇలాంటివేవీ ఉండవు గనుకనే తండ్రి దగ్గరకూతురు సిగ్గుపడదు. ఉంటే సిగ్గు పడిందన్నమాట.

జపాను దేశ స్త్రీలు నిత్యజీవితంలో నగ్నంగానే ఉంటారు. అలా ఉన్నప్పుడు చూసినందువల్ల ఆ జాతి మగవాళ్ళవాళ్ళకి చిత్తవికారం కలగదు. వాళ్ళూ చూసీ చూడనట్లుపోతారు. వీళ్ళూ చుట్టుపక్కల ఎవరున్నారో పట్టించుకోనట్లే పోతారు. కాని, ఆమె విదేశస్థుడి తీవ్రదృష్టికి గురికాగానే సిగ్గుతో కుతకుత ఉడికిపోతుంది. జావాదేశపు స్త్రీలు నగ్నంగా షికారు పోతారు. వాళ్ళకి యూరోపియన్లతో ఇదే అవస్థ ఎదురైంది.

చీకటి ఒకవిధంగా స్త్రీలకు శ్రీరామరక్ష. రాత్రివేళ స్త్రీలు ఏ భయమూ లేకుండా ప్రియుల్ని సంతోషపెట్టడానికి చీకటే కారణం. అందుకే ప్రపంచ మంతటా దాంపత్యవిధులు రాత్రికే అంకితమయ్యాయి.

**● చీకటి ఏ విధంగా స్త్రీల వ్యక్తిత్వాన్ని కాపాడుతుందని మీ అభిప్రాయం?**

పగటి వెలుగులో చెయ్యలేని పనిని స్త్రీలు చీకట్లో చెయ్యగలరు. వేశ్యల విషయం కూడా యింతే. బాగా సిగ్గరులైన స్త్రీలు, పగలు భర్త

ఎదుట పడటానికే అంగీకరించని వాళ్ళు కూడా రాత్రి తమ సర్వస్వాన్ని భర్తకర్పిస్తారు. అప్పుడు ఏ నిరోధాలు అడ్డురావు. చీకట్లో స్త్రీకి స్త్రీత్వం పరిపూర్ణంగా వికసిస్తుంది. అప్పుడు వాళ్ళు కనిపించేటంత అందంగా పగలు కనిపించలేరు. కనుకనే స్త్రీలను నిశాచరులనటం సమంజసం.

"పగలంతా స్త్రీ వంట, ఇల్లు చక్కదిద్దటం మొదలైన పనులన్నీ చూస్తుంది. ఈపనులేమీ నిజానికి పనులేగావు. ఒక విధంగా ఆమెకు విశ్రాంతి లాంటివి. అసలు పని యావత్తూ ఆమెకు సాయంత్రం నుండి ప్రారంభమవుతుంది.

(ఛాంబర్లి)

"పగలున్న సర్వసమత్వ భావం పోయి, ఆమెలో రాత్రి అహం ప్రజ్వరిల్లుతుంది. తర్కం పోయి భావుకత్వం పెరుగుతుంది. విసుగు పోయి శ్రద్ధ కలుగుతుంది. చీటికీ మాటికీ నొచ్చుకునే స్వభావం పోయి కర్మదీక్ష ప్రబలుతుంది.

(గెన్సర్)

**● దృష్టిదోషం ఉన్న వాళ్ళకి సిగ్గు తక్కువగా ఉంటుందా?**

హ్రస్వదృష్టి అనగా దగ్గర వస్తువులే కనబడటం; దూరవస్తువులు కనబడవు. వాళ్ళకి కళ్ళజోడు లేనప్పుడు కన్నా ఉన్నప్పుడే సిగ్గెక్కువ. తమకి ఇతరులు కనిపించేటంత మగతగా ఇతరులకు తాము కనిపించమన్న సత్యాన్ని కళ్ళజోడులో వీరు గ్రహించగలరు. గుడ్డివాడి దగ్గర ఎవరూ సిగ్గుపడరు. కాని పుట్టిగ్రుడ్డి వాళ్ళు మాత్రం మనిషి అలికిడి వినేసరికి సిగ్గుపడతారు. వాళ్ళ మనస్సులు చాలా నిశితమైనవి.

**● సిగ్గేసినప్పుడు ముఖమే కప్పుకుంటారెందుచేత?**

యోని భాగాలలోనూ, ముఖంలోనూ ఉన్న నాడులన్నీ సిగ్గువల్ల జోరుగా పనిచేసి కండర సంకోచానికి కారణమవుతాయి. ఈ రెండింటికీ విచిత్రమైన సంబంధం ఉంది.

ఆఫ్రికా జాతుల్లోనే కొన్ని సిగ్గు వేసినప్పుడు పిరుదుల్ని కప్పుకు

న్నట్లే కొందరు కేవలం ముఖం కప్పుకోవటం జరుగుతుంది. వళ్ళంతా నగ్నంగా ఉన్నా వాళ్ళకి ఫరవాలేదు. ముఖం కప్పుకుంటేచాలు, మహమ్మదీయు లకు, ఒరియా వారికి ముఖమే సిగ్గు కేంద్రం. తతిమ్మా భాగాలన్నీ ఎంత నగ్నంగా ఉన్నా వాళ్ళకి యిబ్బందిలేదు.

ఈజిప్టులో స్త్రీలు 18వ శతాబ్దంలో చంకలనుండి మోకాళ్ళ వరకూ తెరచివున్న ఏకవస్త్రాన్ని తొడుక్కునేవారట! వారు నడుస్తున్నప్పుడల్లా వాళ్ళ శరీరంలోని వొంపులూ సొంపులూ స్పష్టంగా కనబడేవి. అసలుఅంగా లకు ఏ విధమైన మరుగూ ఉండేదికాదు. ముఖానికి మాత్రం ఘోషాఉండేది.

తన ప్రియునికి తన శరీర సంపదలన్నీ అందించే స్త్రీ కూడా ముఖాన్ని చేతులతో కప్పుకోవటం చూస్తాం.

ఈ విధంగా నానా విధాలుగా పరిణమించిన సిగ్గే ఏ నాగరికతలోనైనా దాంపత్య సంబంధానికి అనుబంధించిన ప్రధాన అలంకారంగా స్త్రీలముఖా రవిందంలో నిలిచిపోయింది. ప్రణయంలో సిగ్గే సుందరం, అదే ఆనందాన్ని ఆకర్షణనీ పెంచే అమూల్య సాధనం.



# బహిష్టు

**● సంవత్సరం పొడవునాగాక కొన్ని నెలల్లో మాత్రమే చెట్లు పువ్వులు పూసి కాయలు కాస్తాయి ఎందుచేత?**

చెట్లు సంవత్సరం పొడవునా పువ్వులు పుయ్యవు. వాటికి నియమితమైన కాలం వుంది. అలాగే జంతువులు కూడా కామావేశాన్ని పొందటానికి , సంతానాన్ని కనటానికి సంవత్సరంలో కొన్ని రోజులు మాత్రమే నియమిత మవుతున్నాయి. ఆయా జాతుల జంతువులూ, వృక్షాలూ ఆ కాలంలోనే సృష్టికార్యాలకు పూనుకుంటాయి. కనుక ఆ కాలాన్నే "ఋతువు" అని చెపుతుంటాము. ఈ ఋతు సమయంలోనే చెట్ల పువ్వులు వీర్యకణాలను (పుప్పొడి) అండాలపై వెదజల్లుతాయి. వాటి పరస్పర సంపర్కంవల్ల విత్తనాలు ఏర్పడుతాయి. అలాగే జంతువుల్లో ఆడజాతికి "ఎద" కలగటమూ, మగవాటికి కామోద్రేకం కలగటమూ, అవి రెండూ విడుదలచేసే అండకణాలు కలియటం ద్వారా పిండోత్పత్తి జరగటమూ చూస్తుంటాము. ఆ కాలం మినహాయిస్తే ఆడజంతువులు సంధానానికి అంగీకరించవు. ఘోరరక్తపాతానికైనా సిద్ధపడతవిగాని, కలయికకు యిష్టపడవు. కనుక ఉభయులలోనూ ఏ బలాత్కారమూ అఖరలేకుండానే సునాయాసంగా సంధానం జరగటానికి "కాలం" యిచ్చే సహాయం "ఋతు" కాలంలో కనిపిస్తుంది. కనుక ప్రకృతే ఇట్టి కాలనియమాన్ని ప్రాణికోటికి విధించి వుంటుందన్న భావం మనుష్యులకి కలిగింది.

**● ఈ ఋతువుకి ప్రత్యేక కారణమేదైనా ఉన్నదా? నిత్య కలయికలవల్ల జాతి నాశనం కావటానికి అవకాశమున్నదన్న అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారా?**

మనం ఏకీభవించినా, ఏకీభవించకపోయినా సృష్టిలోనే ఉత్పత్తిని పరిమితంచేసే ప్రవత్తి సహజంగా ఉన్నదన్న సంగతి గ్రహించక తప్పదు. వేసవికాలంలో ఎండగాడ్పులకి ప్రాణి శోభిల్లుతుంది. శీతాకాలంలో చలికి

కొంకర్లు బారుతుంది. వర్షాకాలంలో వరదలు ముంచెత్తుతాయి. ఈప్రకృతి ధర్మాలవల్ల వినాశనం కూడా నియమింపబడింది. కనుక అనుకూల కాలంలో ఉధృతంగా సృష్టి జరపటంకోసమే ఈ కాలనియమం దైవదత్తంగా సంక్రమించిందేమో అనుకోవాలి.

మరో రహస్యమేమంటే ఏ ప్రాణులైతే ఈ ప్రకృతి విజృంభణకి గురియై కాలధర్మాన్ని త్వరగా పొందుతాయో ఆ ప్రాణులే ఎక్కువ సంతానాన్ని ఉత్పత్తి చేస్తాయి. యితర ప్రాణులకు ఆహారమయ్యేప్రాణులే అధికాహారోత్పత్తికి దోహదం చేస్తాయి. ఇతర ప్రాణుల్ని తమకాహారంగా చేసుకునే ప్రాణులు మాత్రం అల్పంగానే సంతానాన్ని పొందుతాయి. కాల నియమం లేకుండా సంతానం కోసం ఏటిపొడవునా సంధానించే మనిషి సంవత్సరానికో బిడ్డకన్నా మించి కనలేకపోవటం గమనించదగ్గది. మనుష్యులు, పులులువంటి క్రూరమృగాలు, అన్నీ పరిమిత సంతానాన్నే పొందుతున్నాయి.

**● ఈ ఋతువుకీ, సూర్యచంద్రుల గమనానికీ ప్రత్యేక సంబంధం ఉన్నదా?**

వేసవికాలం, వర్షాకాలం, శీతాకాలం వంటివి సూర్యుని గమనం వల్లనే కలుగుతున్నాయి గదా! వృక్షాలుగాని, జంతువులుగాని, నియమిత కాలంలోనే సంతానోత్పత్తిని చేస్తున్నాయిగదా! కాలగమనం సూర్యుని ఆశ్రయించి ఉన్నది గనుక సృష్టి (ఋతువు) కూడా సూర్యునివల్లనే ఏర్పడుతున్నదన్న అభిప్రాయాన్ని ఋషులు మొదట్లో ప్రకటించారు. కాని,మనుష్య జీవితం యితర ప్రాణికోటి జీవితంకన్నా భిన్నంగా ఉన్నట్లు కనిపించింది.

ఇతర ఆడజంతువుల్లో లేని బహిష్టు మనుష్య స్త్రీలో కనిపించింది. అది నెలనెలా 28 రోజుల కొకసారి కనిపించసాగింది. అమావాస్య నుండి అమావాస్యకు పట్టిన కాలం 28 రోజులే అవటంతో బహుశా చంద్రుని ప్రభావం వల్లనే స్త్రీల ఋతుకాలం ఏర్పడుతున్నదేమోనన్న అభిప్రాయాన్ని ఋషులు కాలక్రమేణా ప్రకటించారు.

ఏది ఏమైనా సమస్త ప్రాణికోటి కామప్రవృత్తికీ ఏదో కొంత కాల నియమం ఉన్నదనీ, ఆ కాలంలోనే అది సృష్టిని సాగిస్తున్నదనీ ప్రస్తుతానికి భావిద్దాము.

**● అయితే యిలా ప్రతీ ఏటా ఒకే సమయంలో ప్రాణికోటి "ఋతువు" ఏర్పడటంవల్ల కామానికి కూడా ఒక "లయ" ఉన్న దను కోవచ్చా?**

ఆహా! అసలు సృష్టిలోనే లయ ఉన్నది, ఆ "లయ" కామంలో కూడా ఉన్నది. కామంలోనేగాక ప్రాణికోటి శరీరక, మానసిక స్వభావంలో కూడా ఈ "లయ" కనిపిస్తుంది.

శరీరంలోని సమస్తాంగాలు ఒకే లయలో కదులుతాయి! కాళ్ళు విసరటంలో, చేతులు ఊపటంలో, ఊపిరి పీల్చటంలో, కనురెప్పల్ని కదిలించటంలో, పెదవుల్ని అదిరించటంలో, చెవుల్ని ఆడించటంలో, గుండెలు కొట్టుకోవడంలో, నరాలు పనిచేయటంలో, కండరాలు కదపడంలో ఈ "లయ" సర్వేసర్వత్రా కనిపిస్తుంది. మూత్రాశయం కూడా ఒక లయలోనే పనిచేస్తుంది. కండరాలటిస్యూలు ఒకే లయలో సంకోచిస్తాయి. నరాల ప్రకంపనాలు అలాగే ఉంటాయి. పెరుగుదలగాని వార్ధక్యంలో తరుగుదలగాని క్రమబద్ధంగానే ఉంటుంది. అందుకే దీనికి "స్థితి" అని పేరు. స్తబ్దం కాదు. నిత్య పరిణామశీలి. నాశం కూడా క్రమబద్ధంగాపటం వల్లనే "లయ" మయినది. ఈ సృష్టి, స్థితి, లయములన్నీ క్రమబద్ధం కావటమే ప్రకృతి విశేషం. ఇక్కడే మానవమేధ తన ఊహాతీతశక్తికిచేయెత్తి నమస్కరించవలసి వస్తున్నది.

ఈ లయ కేవలం ప్రాణిగతమేకాదు. శబ్దగతం కూడా, మనకు వినబడే శబ్దాలన్నీ లయాన్వితంగానే వుంటున్నాయి. రైలింజన్ కదలికలో పొగకూడా గుప్పుగుప్పుమని ఒకే లయలో బయటపడుతుంది. దీనినిబట్టి సలక్షణమైన ప్రతీ సంచలనమూ లయబద్ధమనే సత్యాన్ని గ్రహించక తప్పదు. నిర్జీవమైన గ్రహాలసంచలనం కూడా లయబద్ధంగానే ఉంది.

గ్రహాలు గతులు తప్పితే విలయమేగదా! కనుక విలయమే ప్రళయమైనది. ఈ సత్యాన్ని శైవులు దృఢపరిచారు.

సృష్టి ఎప్పుడైతే లయబద్ధమయిందో సృజింపబడిన ప్రతీ ప్రాణీ లయబద్ధంగా జీవించ నేర్పింది. అందుకే అది సృజింపబడినట్లయింది. ఇట్లా సమస్త సృష్టిని వినిమయం చేసే శక్తినే "కాస్మిక్ రిధిమ్" అంటున్నారు.

జన్యతః ప్రాణి ప్రాణికీ స్వభావంలో తేడా ఉంటుంది. పారంపర్య గుణాలు ప్రాణికో రకంగా వుంటాయి. అయినప్పటికీ అవి కూడా వాతావరణ ప్రభావానికి లోను కావలసిందే.

**● చంద్రుడికీ మనుష్య స్త్రీ బహిస్టుకీ సంబంధం ఉన్నదన్నారుగదా, అది ఎంతవరకూ నిజం?**

సృష్టి యావత్తూ యధాతథంగా ఉత్పన్నమయినదేగాని క్రమ పరిణామాన్ని పొందలేదన్న మతసిద్ధాంతాలను ఢీ కొంటూ డార్విన్ అనే శాస్త్రిజ్ఞుడు పరిణామ సిద్ధాంతం ఉదాహరణలతో రుజువుచేశాడు. అయనే ఈ ప్రశ్నకు పరోక్షంగా జవాబు చెప్పాడు. క్షీరదాలు గర్భవతులవ్వటంగాని, అండజాలు (పక్షులు) గ్రుడ్లు పెట్టి పొదగటంగాని, అవి జీవించే వాతావరణాన్ని బట్టి వుంటుందని అన్నాడు.

అదే బహిష్టు విషయం లోనూ చెప్పుకోవాలి. విమానయానం చేసే మహిళలు తక్కువ విరామాల్లోనే బహిష్టు అవుతుంటారు. దీనిని బట్టి పల్లపు ప్రాంతాలలో నివసించే స్త్రీల బహిష్టు కాలానికి, కొండపై నివ శించే స్త్రీల బహిష్టుకాలానికీ అంతరం ఉన్నదని చెప్పాలి. అలాగే ఉష్ణ మండలాలలో నివసించే స్త్రీ బహిష్టు కాలానికీ, శీతలమండలంలో నివ సించే స్త్రీ బహిష్టు కాలానికీ పెద్ద అంతరం వుంటుంది.

పైగా బహిష్టు మనుష్య స్త్రీలోనే ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సాధారణంగా స్త్రీలు ప్రతి 28 రోజులకూ ఒకసారి బహిష్టు అవుతుంటారు. చంద్రసంక్రమణం కూడా ప్రతీ 28 రోజులకీ ఒకసారే జరగటం కేవలం కాకతాళీయమే. ఈ రెండింటికీ సంబంధంలేదు. సంబంధమే వున్నట్లయితే

స్త్రీలంతా కలసికట్టుగా ప్రతీ అమావాస్యకీ బహిష్టుకావాలి. అలాకాక అందరూ తలో తిథిలోనే ఎందుకు అవుతున్నారు?

మరో సంగతి-- అధిక సంఖ్యాక స్త్రీలు ప్రతీ 28 రోజులకూ బహిష్టు అవుతున్నప్పటికీ కొందరు బాగా ఎక్కువ రోజులకీ- మరికొందరు బాగా తక్కువ రోజులకీ అవుతుంటారు. ఈ రోజుల సంఖ్య అందరిలోనూ నియమితంగా లేదు. సరిగదా ఒకసారి 15 రోజులకీ ఒకసారి 35 రోజులకీ బహిష్టు అయ్యే స్త్రీలు కూడా ఉన్నారు. బహిష్టు క్రమపద్ధతిలోలేనంత మాత్రాన రోగమనటానికి వీలులేదు. అసలు బహిష్టేకాని స్త్రీలు కూడా ఆరోగ్యంగా వుంటున్నారు. కనుక బహిష్టుకీ, చంద్రుని గమనానికి సంబంధమే లేదని చెప్పుకోవాలి.

**● అయితే చంద్రుడికీ మన కామప్రవృత్తికీ యే విధమైన సంబంధమూ లేదనే చెప్పాలా?**

అంత తేలిగ్గా తీసిపారెయ్యటానికి వీలులేదు. బహిష్టుకీ చంద్రుడికీ సంబంధం లేకపోవచ్చును. కాని ప్రాణికోటి యొక్క కామప్రవృత్తికీ చంద్రునికీ సంబంధం ఉంది. మన అలవాట్లు, మానసిక ఆవేశాలూ చంద్రుని చల్లదనంవలన మనలో కలిగే వికారాలూ వీటిని బట్టి పై ప్రశ్నకు సమధానాన్ని నిర్ణయించాలి. మనుష్యులకు శత్రుభీతివలన పగలు సంధానయోగ్యకాలం కాకుండాపోయింది. పైగా పగటి వేడిమి ప్రాణికోటి శరీరంపై పనిచేసి కామాన్ని నిరుత్సాహపరుస్తుంది. రాత్రివేళల్లో చీకటి తెర కట్టడం వల్ల ఒకరి దాంపత్యానందం యింకొకరి కళ్ళపడదు. ఈ విధంగా చీకటియే శరణ్య మయింది. అది అలవాటు అయింది. పైగా శరత్ వెన్నెలా, పున్నమి చంద్రుడూ, దంపతుల చిత్తవృత్తిని గిలిగింతలు పెట్టి ప్రేరేపించటం జరుగుతున్నది. చల్లదనం యెక్కడున్నా కామాన్ని ప్రకోపింపచేయగలదు. పైగా లయాన్వితమైన మానవుని కామప్రవృత్తిని నెలనెలా క్రమపద్ధతిలో వెన్నెల కురిసే చంద్రునికి అనుబంధించు కోవటం సహజమే. మనస్సుకి కలిగిన ఆహ్లాదమే, శరీరంలోని నరాలవ్యవస్థ

ను కూడా ప్రేరేపిస్తుంది. అట్టి ప్రేరేపణ నెలనెలా చంద్రునితో పాటు కలుగుతూ వచ్చింది. మనుష్య స్త్రీ వ్యవస్థ కేవలం మనస్సు వలన చంద్రాంకితం కావడంతో ఇతర జంతువులలో లేని బహిష్టు వ్యవస్థ మనుష్యజాతిలో ఏర్పడిందని చెప్పాలి. నాగరిక జీవితంలో నరాల వ్యవస్థ రాను రాను మరింత తీవ్రంగా ప్రేరేపించటంవలన వారానికో బహిష్టు జరిగే రోజులు వస్తున్నాయని చెప్పకతప్పదు. ఒకప్పుడు జాబిల్లిని ఆశ్రయించిన కామ ప్రేరణయే రాను రాను కాఫీని ఆశ్రయిస్తున్నది.

**● భారతీయులేగాక, పాశ్యాత్యులు కూడా బహిష్టుపై చంద్రప్రభావం కలదన్న విశ్వాసంతో ఉండేవారా?**

అవును, అన్ని మతాలకీ ఈ విశ్వాసమున్న సత్యాన్ని మనకన్నా ముందుగానే పాశ్యాత్యులు గ్రహించారు.

దంపతుల శృంగారకేళికి వెన్నెలరాత్రి చాలా అనుకూలమైందనీ ఋతువుకీ, చంద్రుడికి సంబంధమున్నట్లుగా ప్రాచీనులు భావించేవారని మాంటిగెజ్జా అన్నాడు. శరీరపుష్టిగల యువకులకి ఒహపట్టాన నిద్రపట్టక పోవటం చంద్రుడి ప్రభావమేనని లోకం భావిస్తున్నట్లు నెల్సన్ వ్రాశాడు. యువకుల ఆలోచనల్ని కామ కలుషితం చేయటానికి వెన్నెల రాత్రి బాగా పనిచేస్తుంది. వారిలో విరహాన్ని ప్రజ్వాలింపజేస్తుంది. అసలే నరాల దౌర్బల్యం గల వారైతే మంచంపట్టాల్సిందే. పిచ్చెత్తినవారు కూడా లేక పోలేదు.

**● మన సాహిత్యంలోనూ, సంస్కృతిలోనూ వెన్నెలకు చంద్రుడికి ఎందుకంత ప్రాధాన్యత వచ్చిందంటారు?**

దేవాసురులు సముద్ర మధనాన్ని చేసినప్పుడు లక్ష్మి, చంద్రుడూ అమృతమూ,హాలహాలమూ పుట్టాయి. లక్ష్మికి మన్మధుడు పుట్టాడు. మన్మధుడికి చంద్రుడు మామయి చందమామయ్యాడు. జగమంతా చంద్రుణ్ణి కన్నెత్తి చూసింది. ప్రతీ బిడ్డకీ చంద్రుణ్ణి చూపించి తద్వారా మనస్సు రంజింపజేస్తుంది తల్లి. ఈ విధంగా ఉగ్గుపాలనుంచీ చంద్రుడికి

బిడ్డ నరాల వ్యవస్థపై ఆధిపత్యం ఏర్పడుతుంది. ఇది మన సంస్కృతి.

ఈ సంస్కృతి పుట్టు పూర్వోత్తరాలను పరిశీలించిన కొద్దీ యింకా అద్భుతమైన యెన్నో విషయాలు బయల్పడతాయి. రాత్రింబగళ్ళు సూర్యుడి వలన యేర్పడుతాయి. మన కష్టసుఖాలకు, వియోగ సంయోగాలకు అవి సంకేతాలైనవి. చంద్రుడి స్థితి కూడా రోజు రోజూ మారుతుంది. మన మనస్థితికిది సంకేతమైనది. చంద్రుడిలో రోజు రోజు కనిపించేమార్పుల్ని చూస్తున్న కొద్దీ మానవజాతికి ఆశ్చర్య సంభ్రమాలెక్కు వయ్యాయి. మన ఆర్థిక వ్యవస్థలో హెచ్చు తగ్గులకీ చంద్రుడికి పోలిక తెచ్చుకున్నాము. మన సిరి సంపదలు (లక్ష్మి) కూడా చంద్రుడివలె చంచల మైనవను కున్నాము. ధరహెచ్చుట తగ్గుటకొరకే అనుకుంటూ విదియ చంద్రుడి కొమ్ములకీ వ్యాపారానికీ ముడి పెట్టాము. మొదట్లో చంద్రుడు మనకు గడియారంగా ఉపయోగపడ్డాడు. నెలను నెలరాజు రెండు పక్షాలు చేశాడు. శుక్లపక్షం, కృష్ణపక్షం అవతరించాయి. పురుషుడిలో శుక్లం ఎక్కువగా ఉండే పక్షం శుక్లపక్ష మనిపించుకుంది. ఆ చంద్రుడే మనకు తిథులను (తేదీలు) నిర్మించిపెట్టాడు. వ్యవసాయానికీ చంద్రుడికీ సంబంధం ఏర్పరచుకున్నాము. వరి మొక్కలు ఈనినప్పుడు అందులో చంద్రుడి వెన్నెల పడితేగాని బియ్యం తయారుకాదని మన రైతుల విశ్వాసం. ఈ విధంగా మన మానవ జీవితమే చంద్రుడిలో లీనమైపోయింది. మన జాతేకాదు సమస్త ప్రపంచ జాతులు చంద్రుడిలో విలీనమై పోయాయని చెప్పుకుంటే చాలు.

**• ప్రపంచంలో అన్ని దేశాల స్త్రీ జనసామాన్యమంతా నెలనెలా ఒకే కాలంలో బహిష్టు అవుతారా?**

ప్రపంచమంతటా స్త్రీలందరూ ఒకే నెలసరి ప్రమాణంలో బహిష్టవుతున్నారన్న విశ్వాసం చాలామందికి ఉంది. అది తప్పు. దేశాన్ని బట్టి, వాతావరణాన్ని బట్టి చాలా మార్పులున్నాయి.

అనాది జాతుల్లో నాగరిక జాతుల్లోకన్నా బహిష్టుల మధ్య ఎడం

తక్కువగా వుంటుంది. ఉత్తరధృవ ప్రాంతాలలో నివసించే ఎస్కిమోస్త్రీలు 10వ ఏట రజస్వలవుతారు. శీతాకాలంలో బహిష్టవరు. ఇతర కాలాలలో రెండు మూడు సార్లు ముట్టవుతారు. గ్రీన్‌లాండ్ లోని స్త్రీలు మూడేసీ నెలలకొకసారి బహిష్టవటంగాని సంవత్సరానికి రెండు మూడు సార్లు బహిష్టపటంగాని జరుగుతుంది. ఫెరో దీవులలో స్త్రీలు సాధారణంగా బహిష్టుకారు. కొన్ని జాతుల్లో బహిష్టు స్రావం నామమాత్రంగా వుంటుంది. అదైనా ఏ సంవత్సరానికో ఒకసారి కనిపిస్తుంది. ఎంత అనాదిజాతి వారైనా ఉష్ణమండలాలలో ఉంటే వారి పరిస్థితి భిన్నంగా వుంటుంది.

**• అయితే బహిష్టు పరిణామంలో నాగరిక స్థాయి అంటూ ఏదయినా ఉందా?**

అదే విచిత్రం. యూరవ్ దేశాల ప్రజలను మానవ పరిణామంలో చివరిదశగా గుర్తిస్తే యూరపు దేశాలలో ప్రతీ పక్షానికీ ఒకసారి బహిష్టయే లక్షణాలు ఇటీవల హెచ్చుతున్నాయని చెప్పుకోవలి. భారతీయ స్త్రీ నెలకొకసారి బహిష్టవుతుంది. అనగా నెలలో ఆమెకు గర్భాన్ని ధరించే అవకాశము ఒక్కసారే ఉన్నది. యూరోపియన్ స్త్రీ నెలకు రెండుసార్లు బహిష్టవుతూ నెలలో గర్భాన్ని ధరించే అవకాశాలను రెండుసార్లు పొందుతున్నది. కొందరు బహిష్టు కాకపోయినా ఆ కాలంలో బహిష్టు నొప్పితో బాధపడతారు. యీ అవస్థనే ''ఋతు మధ్య స్థితి'' అని చెప్ప వచ్చును.

**• ఋతుస్రావం కనిపించకుండానే స్త్రీలు బహిష్టయినట్లు చెప్పవచ్చునా?**

బహిష్టుకు రజోస్రావం ఒక్కటే ప్రమాణం కాదు. ఆమె ఉచ్ఛ్వాసం ఉష్ణోగ్రత, నరాలస్థితి- వీటన్నిటి ఫలితంగా రజోస్రావం కనిపిస్తుంది. అది కనిపించినా కనిపించకపోయినా ఆయా అవస్థలన్నీ సంక్రమిస్తే ఆమె బహిష్టయినట్టుగానే పరిగణించాలని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. సమర్తాడక పూర్వం ఆడపిల్లల్లో నెల నెలా ఈ లక్షణాలు కనిపిస్తాయి. ముట్లుడిగిన స్త్రీలలో ఆ సమయానికి ఈ లక్షణాలు వస్తాయి.

**● ఈ "ఋతుమధ్యస్థితి" ఎలా వుంటుందో వివరిస్తారా?**

బహిష్టుకి బహిష్టుకి మధ్య కాలంలో స్త్రీ పొత్తి కడుపులో విపరీతమైన నొప్పి బయలుదేరుతుంది. స్రావం కొద్దిగా కనిపించినా కనిపించవచ్చు. గతసారి బహిష్టయిన తర్వాత 14 రోజులకు వచ్చి రెండు మూడు రోజుల వరకూ ఉంటుంది. అప్పుడు శరీర ఉష్ణోగ్రత యెక్కువగానే ఉంటుంది. అయినంత మాత్రాన వాని ఆరోగ్యంలో దోషం వుండదు. ఎక్కువగా సూర్యరశ్మి సోకిన స్త్రీలకు ఈ ఋతు మధ్యస్థితి వస్తుందని చెప్పాలి. అప్పుడు అసూర్యంపశ్యలకు ఈ అవస్థ ఉండదని చెప్పవలసివస్తుంది. అదే నిజమైతే పురుషునితో సమానహక్కులకు స్త్రీలు శరీరతః అర్హులు కారని నిర్ణయించకతప్పదు.

**● జంతువులలో బహిష్టు లేదు. గనుక వాటికి అవస్థలు ఉండవనుకోవచ్చా?**

మనుష్య స్త్రీ జీవితం నేటికీ రహస్యంగా ఉన్నట్లే జంతు జీవితం కూడా నేటికి రహస్యంగా వుండిపోయింది.

చాలా జాతి జంతువులు బహిష్టుకావు. దీనికి బదులు ఏటేటా, వాటికొక "కార్తి" వుంటుంది. ఆ కార్తిలోనే వాటికి వళ్ళు వేడుక్కుతుంది. వసంతంలోనూ, శీతాకాలంలోనూ, ఈ కార్తి కనిపించవచ్చును. చిత్తకార్తి కుక్కల చిత్తప్రవృత్తులపై ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తుందో మనకు తెలిసిందే. ఆ కార్తి వచ్చేసరికి స్త్రీ జననాంగాలు మెత్తబడటమూ, నల్లబడటమూ, ఉబ్బి ఒకరకమైన మద పదార్థాన్ని విడుదలచేయటమూజరుగుతాయి. అడవి జంతువులలో కన్నా అదే జాతి పెంపుడు జంతు వులలో ఈ విషయం మరింత అభివృద్ధిని సాధించింది. బాగా అభివృద్ధి పొందిన జంతువులలో యీ స్రావం రక్తసిక్తమై మామూలు రజస్సుగా కనిపిస్తుంది.

**● మనుష్య స్త్రీలు కాక జంతువు లేవైనా మామూలు రజస్సును విడుదల చేస్తాయా?**

కోతులకు ఈ రజస్సు వెలువడుతుంది. నెల నెలా ప్రతీ అమా

వాస్యకీ కోతులు బహిష్టవుతాయని ఒక శాస్త్రజ్ఞుడు కనుగొన్నాడు. అన్ని రకాల కోతుల్లోనూ ఈ రక్తస్రావం స్పష్టంగా కనిపిస్తుంది. మెకాక్‌జాతి కోతులకు స్వతహాగా పాలి పోయి ఉండే ముఖమూ, మెడ మున్నగు నగ్నంగా ఉన్న భాగాలన్నీ ఈ సమయంలో పెంకురంగు కలిగి వుంటాయి. కొన్ని కోతులకు మరీ ఎర్రబడతాయి. స్రావం తక్కువే వుంటుందిగాని,రంగు మాత్రం చాలా రోజులుదాకా మారదు అంగాధరాలు బాగా ఉబ్బిపోతాయి.

**● మనదేశంలో ఈ విషయాలపై ఏవైనా పరిశోధనలు జరిగాయా?**

1894లో హీవ్ అనే ఆయన కలకత్తాలోని జంతు ప్రదర్శనశాలలో కొంత పరిశీలన చేశాడు. అన్ని జాతుల కోతులూ ఖచ్చితంగా 36 రోజులకు ఒకసారి బహిష్టయ్యాయన్నాడు. నాలుగురోజులు స్రావం వున్నదట. ఆ సమయంలో వాటి చనుమొనలు, యోని రక్తంతో పొటెక్కి ఉబ్బినవన్నాడు. పిర్రలు ఉబ్బి ఎర్రబడేవట.

బాబూన్‌జాతి వానరాలు నెలా పదిహేను రోజుల కొకసారి బహిష్టుఅవుతాయి.

చిత్రమేమిటంటే ఈ వానరాలలో మనుష్య సహజమైన బహిష్టే కాకుండా జంతు సహజమైన "ఎద" (RUT) కూడా వుంటుంది.

చింపాంజీ ఒరాంగుటాన్ వంటి మనుష్యజాతి వానరాలన్నీ బహిష్టవుతాయి. యోని బాహ్యాధరాలు ఉబ్బటమూ, పెరగటమూ ఎర్ర బడటమూ, కామోద్రేకం ఎక్కువ కావటమూ ఈ సమయంలో జరుగుతాయి. చింపాంజీ పదవయేట సమర్తాడినట్లు పరిశీలకులు చెప్పారు.

దీనిని బట్టి ప్రపంచ మంతటి స్త్రీ జీతిలోనూ, ప్రత్యక్షంగానో పరోక్షంగానో బహిష్టు వున్నదన్న తేలింది.

**● బహిష్టు అంటే ఏమిటి?**

బహిష్టు లక్షణాలను బట్టి అదంటే ఏమిటో చెప్పటం తేలికే. నెలనెలా గర్భాశయం నుండి రక్తస్రావం జరగటమే బహిష్టని అందరికీ తెలుసు, దీనికి కారణమేమిటి? ఇందులో వినియోగింపబడే యాంత్రాంగ

మేమిటి? అన్న విషయాలే ఎక్కువమందికి తెలియవు, పూర్వ పరిశీలకు లందరూ ఈ ప్రశ్నకు నేరుగా జవాబు చెప్పలేక విఫలమైనవారే.

ఏమైనా గర్భాశయం నెలనెలా నియమితమైన కాలంలో సంకోచించటంవల్ల బహిష్టు స్రావం కలుగుతుందనే చెప్పుకోవచ్చు. గర్భాన్ని ధరించటానికి ఆయత్తమైన గర్భాశయం విఫలమవటం మూలంగా ఈ స్రావం వెలువడుతుంది. ఇంచుమించు నెలనెలా వచ్చే పురుడులాంటిది. ఒక విధంగా చిన్నతరహా గర్భ విచ్ఛేదమనే చెప్పుకోవచ్చు. బహిష్టుకు సంబంధించిన శరీరపరిణామంగాని, శరీర కారణాలుగాని ప్రస్తుతం మనం పరిశీలించడం లేదు. ఈ వ్యాసంలో కేవలం మనస్తత్త్వ కారణాలనే చూడదలిచాం గనుక ఆ నిర్వచనాన్ని అంతటితో విడిచి పెట్టటం మంచిది.

**● అండస్రావానికీ బహిష్టుకీ ప్రత్యక్ష సంబంధమేమైనా ఉందా?**

ఒకప్పుడు ఈ రెండింటికీ ప్రత్యక్ష సంబంధముందనేవారు. బహిష్టు సమయానికి స్త్రీ అండకోశాలలో ఒక అండం పరిపూర్ణంగా పెరిగి విడుదలకు సిద్ధంగా ఉండటంవల్ల గర్భాశయాన్ని కాళీ చేయటం కోసమే యీ బహిష్టు జరిగిందనే అభిప్రాయం వ్యాప్తిలో వుండేది. జీవిత కాల మంతా అండవిసర్జన జరుగుతూనే వుంటుందని ఆ బిడ్డ తల్లి కడుపులో ఉన్నప్పుడు; తాను కడుపుతో ఉన్నప్పుడు కూడా యీ అండ విసర్జన జరుగుతూనే ఉంటుందని, ఇటీవల శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. అండకోశాలను శస్త్రచికిత్స ద్వారా తొలగించినప్పటికీ స్త్రీ బహిష్టవుతూనే వుంటుంది. అలాగే అండవాహికల్ని తొలగించినాసరే.

కొందరు స్త్రీలకు జన్మతః గర్భాశయం క్షీణించిపోయి వుంటుంది. గర్భాశయం ఎందుకూ పనికిరాని స్థితిలో ఉన్నందున అట్టి స్త్రీలు బహిష్టేకారు. అయినా వారి అండాశయాలలో దోషం వుండదు. అవి నెల నెలా మామూలుగానే అండవిసర్జన చేస్తూ వుంటాయి.

**● ఇతరత్రా సంపూర్ణ ఆరోగ్యంలో ఉన్న స్త్రీ బహిష్టుకాకపోతేదోషమా?**

ఇతరత్రా సంపూర్ణ ఆరోగ్యంతో వున్న స్త్రీ బహిష్టుకాకపోతే దోషం

గాని, అనారోగ్యంగాని వుండవు. దాని గురించి కంగారు పడవలసిన అవసరం లేదు.

**● కొన్ని ఆడజంతువుల్లో కనిపించే "ఎద" వంటిదే ఈ బహిష్టు అనుకోవచ్చా?**

1898సం॥లో పౌలెట్ అనే ఆయన సరిగ్గా యిదే అభిప్రాయాన్నిచ్చాడు. అంతకుపూర్వం పాశ్చాత్య ప్రపంచానికి యీ అభిప్రాయం లేదు. కాని భారతీయ ఋషులు ఇదే అభిప్రాయాన్ని కలిగివుండేవారు. బహిష్టును వారు "ఋతువు" అన్నారు. వసంత గ్రీష్మాదులు ఏటేటా నియమితకాలంలో వచ్చినట్లే స్త్రీ బహిష్టు నెలనెలా నియమిత కాలంలో వస్తుంది. గనుక దానిని కూడా "ఋతువ"నే అన్నారు. అలాగే కామవాంఛ ఆమెకు ఋతువు వల్లనే కలుగుతుంది గనుక "ఋతు కాలం"లోనే కలియాలని ప్రాచీన ఋషులు అభిప్రాయపడ్డారు. మనువు దానిని ఖండించి ఋతుస్రావం ఉడిగిన తర్వాతనే కలియవలెననిశాసించాడు. కలయిక విషయం ప్రక్కకు పెట్టి ఆలోచిస్తే మనుష్య స్త్రీల "ఎద" బహిష్టు ఒకే కాలంలో జరుగుతాయన్న శాస్త్రి దృష్టిని మన ప్రాచీన ఋషులు కలిగి వుండేవారని చెప్పుకోవచ్చు.

పాశ్చాత్య శాస్త్రజ్ఞులు యీ వాదాన్ని చాలా కాలం వరకూ అంగీకరించలేదు. వారు అంగీకరించకపోవటానికి తగిన హేతువు కూడాలేదు. బహిష్టు, ఎద రెండూ ఒకటే అన్నట్లయితే బహిష్టు సమయంలో మనుష్య స్త్రీలు కలయికను ఎందుకు అంగీకరించటంలేదని ఒకాయన ప్రశ్నించాడు. కనుక యీ రెండూ ఒకటికాదని ఆయన వాదం. ఇతర జంతువుల్లో ఎద కలిగినప్పుడు ఆడజంతువులన్నీ విధిగా సంప్రయోగానికి అంగీకరిస్తాయి. కాని బహిష్టు సమయంలో ఏ స్త్రీ సంప్రయోగానికి అంగీకరించదు. పైగా ప్రాచీనకాలంలో కొన్ని దేశాలలో ఈ సమయంలో సంప్రయోగం చేసిన పురుషులకు ఉరిశిక్ష విధించేవారు. కావచ్చు. అది సాంఘిక నీతికి సంబంధించిన విషయం.

వేదకాలంలో బహిష్టు స్త్రీలతోనే పురుషులు కలిసేవారని ఊహించవచ్చు. స్వారోచిష మనువు ఋతుస్రావం ఏహ్యమైనదని అపరిశుభ్రమైనదనీ నిషేధించి వుండాలి.

మధ్యయుగాల క్రైస్తవ మతాధిపతులు బహిష్టు స్త్రీతో సంపర్కం మహాపాపమని ప్రచారం చేసినట్లుగా తెలుస్తున్నది. అలాంటి సమయంలో గర్భవతులైనవారి కడుపున కుష్టురోగులు, వికృతాకారులు పుడతారని ప్రచారం చేసేవారు. కాని ఆధునిక మతప్రపక్త లెవరూ, సూత్న శాస్త్రి పరిజ్ఞానంవల్ల బహిష్టు కాలంలో కలయిక మహాపాపంగా పరిగణించటం లేదు. అశౌచంగా భావించారు.

**● బహిష్టు కావడమంటే మైల పడటమనీ, బహిష్టు స్త్రీలు బైట కూర్చోవాలని మగవాళ్ళు ఎందుచేత చెప్తున్నారు?**

ఇది మతదృష్టి మాత్రమే. "అశౌచము" అనగా శుచిగా లేకపోవుట అని అర్థం. దీనికే మైల అని పేరు. మైల అనే మాట "మలము" అనే మాటనుండి ఉత్పన్నమైనది. ఆ విధంగా మలమూత్రాదులు మైల అయ్యాయి. మలమూత్రాదులు విసర్జింపబడినట్లే రజస్సు కూడా మూత్రాంగం నుండి విసర్జింపబడటం వల్ల మైల అయింది. కాని మలమూత్రాదుల వల్ల కలిగే మైల ప్రక్షాళనం వల్లపోతుంది. రజస్సు అలా కాదు. అది మూడు రోజులపాటు ధారాపాతంగా వస్తుంది. గావున ఆ మూడు రోజులూ అశౌచంతప్పదు. ఈ అశుచివల్లనే ఆ మూడు రోజులూ స్త్రీలు బయట కూర్చోవాలని పూర్వీకులు నిశ్చయించారు.

వారు విధించిన శాసనాలను "ధర్మ సింధువు" నుండి ఉదహరిస్తున్నాము చదవండి.

"మూడు రోజుల పర్యంతము ముట్టుకోకూడదు. తలంటు,కాటుక, స్నానము, పగటినిద్ర, అగ్ని స్పర్శ, దంతధావనం, మాంసభోజనం, సూర్య దర్శనం, ముగ్గులు పెట్టుట చేయకూడదు. కఠిన నేలపై పండుకోవలెను. దోసిలితోగాని, లోహపాత్రలోగాని, నీరు త్రాగకూడదు. చిన్ని గిన్నెతో త్రాగి

నచో మరుగుజ్జు పుత్రులు పుట్టుదురు. ఆకులతో త్రాగినచో వెర్రిసంతతి కలుగును! ప్రయాణము, గంధమూల్యములు, తాంబూలములు, గోవుపాలు, పెరుగు, చల్ల నిషేధింపబడినవి. పీట మొదలైనవి యెక్కి కూర్చొనరాదు. ఎండలో గాని, నేలమీద గుంటలోగాని భోజనం చేయాలి. గ్రహణంవంటి కారణాలవల్ల ఆ సమయంలో స్నానం చేయవలసి వస్తే బట్ట విడవకూడదు. మరో బట్ట కట్టుకోకూడదు..." ఈ విధంగా కఠిన నియమ నిషేధాలను విధించారు.

**● అయితే ఈ నియమాలను రజస్వల స్త్రీలు విధిగా పాటించాలని మీ అభిప్రాయమా?**

రజస్వల సమయంలో సంప్రయోగం నిషిద్ధంకాదని ఆధునిక శాస్త్రజ్ఞులెప్పుడైతే అంగీకరించారో అప్పుడీ అశౌచాన్ని పాటించవలసిన అగత్యత కూడా స్త్రీలకు లేదు. బహిష్టును గర్భస్రావంగా ఈ శ్రోత్రియులు పరిగణించారు. వాస్తవానికి అలా కాదుగదా! పైగా వారు భావించినట్లది స్త్రీలు చేసుకున్న పాపం కూడా కాదుగదా! ప్రకృతి ధర్మమది. బహిష్టు స్త్రీలకు దంతధావనం (పళ్ళు తోముకొనుట) కూడా పనికి రాదంటే హాస్యాస్పదంగా లేదా? పోనీ పెరుగూ, చల్లత్రాగటంవల్ల నజ్జిస్తుందనీ అందువల్ల స్రావం సరిగా జరగదని వద్దనుకున్నారనుకున్నాం. స్నానంచేసిన స్త్రీ నీళ్ళోడుతూ నిలబడాలేగాని బట్ట పిడుచుకోనూ కూడదు; మరో బట్ట కట్టనూ కూడదంటే అర్థమేమిటి? అప్పుడు మరింత ప్రమాదం కాదా? గంధమూల్యాలు తాంబూలము కామాసక్తతను పెంచుతాయి గనుక వద్ద న్నారంటే మరి తొలి రజస్వలలో ఎందుకనుమతించారు?

ఏమైనా ఈ ఆచారం అర్థంలేనిది. శుభ్రంగా స్నానం చేసి యిస్త్రీ మడతల్ని కట్టుకుని ఉల్లాసంగా యింట్లో తిరగవచ్చని మా అభిమతం.

**● బంధు మరణానికి విధించే అశౌచంలో ఇలాంటి నియమాలనే పూర్వీకులు విధించారు. బహిష్టును గర్భవైఫల్యంగా భావించవచ్చనివీరే చెప్పారు. అలాంటప్పుడు బహిష్టును గర్భస్రావమే అన్న భావంతోబహి**

**ష్టకు కూడా మన పూర్వీకులు "మరణాశౌచాన్ని" విధించారని యెందుకు భావించకూడదు.**

ఈ వాదం కొంత సబబైనదే. అయినప్పటికీ తర్కబద్ధం కాదు. గర్భ విచ్ఛిత్తి మొదటి నాలుగునెలలలోనూ జరిగితే "స్రావ" మవుతుందని, అయిదారు నెలలో జరిగితే "పాప" మవుతుందనీ ఆ తర్వాత జరిగితేపురిటి క్రిందే లెఖ అని, ఈ పూర్వీకులే అంగీకరించారు. ఆఖరిదానినే "ప్రసూతి" అంటారు. స్రావమునకు మూడు రోజులు అశౌచమని ధర్మశాస్త్రిలు చెపుతున్నమాట నిజమే.

బహుశా ఆ దృష్టితోనే వారు బహిష్టు స్త్రీని వెలివేసి ఉండాలి. అది జననాశౌచమేగాని మరణాశౌచం కాదు. ఈ జననాశౌచం కూడా ప్రసూతి వలన అయితే విప్రునకు పదిరోజులు, క్షత్రియునకు పన్నెండు రోజులూ, వైశ్యులకు పదునైదు రోజులూ శూద్రులకు మాసమూ అనుభవింపదగినవి. సంకరజాతులకు అశౌచమే లేదని విజ్ఞానేశ్వ రుడన్నాడు. స్నానంతో సరిపోతుందట.

గర్భ నిరోధాన్ని పాటించనందుకు ఇది శిక్షయితే కావచ్చునుగాని దీనికి తర్కబలం లేదు.

పైగా స్రావానికి జననాశౌచాన్నే విధించటంవల్లనూ, మరణాశౌచం లేదని స్పష్టంగా చెప్పటం వల్లనూ దానిని పురుడుగానే భావించినట్లు కనిపిస్తోంది. కాని మరణంగా భావించినట్లు కనబడటం లేదు. యెటొచ్చీ బిడ్డ మాత్రం కనబడదు.

ఇప్పుడు జననాశౌచాన్ని ఎవరూ పాటించటం లేదు. కనుక బహిష్టు స్త్రీలు "వెలుపల" ఉండవలసిన అవసరం లేదు.

**● పోనీ మృతశౌచంగా భావించి ఉన్నట్లయితే "వెలుపల" సమంజసమేనా?**

బొడ్డు కోయకముందే బిడ్డపోతే జననాశౌచం తండ్రికి మూడు రోజులు తల్లికి పదిరోజులూ అన్నారు. బొడ్డు కోసిన తర్వాత పదిరోజులోగా

మృతినొందినచో పదిరోజులు తండ్రికి కూడా జననాశౌచమే ఉన్నదన్నారు. మృతశౌచం తల్లిదండ్రులలో ఎవరికీ లేదు. ఆ పదిరోజులూ దాటిన తర్వాత నామకరణంలోగా మగబిడ్డ పోతే రెండురాత్రులు, ఆడబిడ్డపోతే ఒక పగలు మరణశౌచమన్నారు. ఇక్కడ కూడా లింగ భేదాన్ని పాటించిన సంగతి గమనించండి.

మొదటి పదిరోజులలోగా బిడ్డపోతే మరణ అశౌచం లేదనేఅన్నారు. గనుక బహిష్టు స్త్రీలు మరణాశౌచాన్ని పాటించనక్కరలేదు.

**● అర్షధర్మాన్ని మీరు త్రోసి పారవెయ్యటం ధర్మమేనా?**

స్మృత్యర్థసారమనే గ్రంథం ప్రకారం తండ్రి యింట్లో కూతురు ప్రసవించినచో ఆమె తల్లిదండ్రులకూ, అన్నదమ్ములకూ, పినతండ్రులకూ ఒకరోజు జననాశౌచ మున్నదని ఉంది. ఆమెయే భర్త యింట్లో పురుడు పోసుకున్నట్లయితే వీరెవ్వరికీ అశౌచం లేదట! ఏమిటి దీని అర్థం? ఆడబిడ్డ పుట్టింట్లో పురుడు పోసుకోకూడదన్న నిషేధమే కదా, అనగా ఈ ఆచారాలకు అర్థాంతరాలు వేరే వున్నాయి.

అదీగాక కూతురు పురుడు పోసుకుంటే జననాశౌచాన్ని ఎంతఛాందస బ్రాహ్మణులైనా ఆమె తల్లితండ్రులూ, అన్నదమ్ములూ పాటించటమేలేదు. అలాంటప్పుడు ఈ చాదస్తం దేనికి?

పైగా రజస్వల, మరణం కాదు. విఫలమైన అండం ఆసమయంలో బయటకు స్రవిస్తుంది. ఆ అండం వీర్యకణాలచే పొదగబడకపోవటం వలన పిండమేకాదు. గర్భస్రావంలో పిండమే విచ్ఛేదమవుతుంది. దానికి అశౌచాన్ని పాటించినా అర్థం వుంది. బహిష్టుకు దేనికి?

**● అయితే బహిష్టు సమయంలో స్త్రీలను వెలివేసే యీ విధానాన్ని మీరేవిధంగా భావిస్తున్నారు?**

ప్రకృతి ధర్మం మీద మానవమేధస్సు చేసిన తిరుగుబాటుగానే దీన్ని నేను భావిస్తాను. ప్రకృతి సహజస్వభావాన్ని అంగీకరించలేక మనుషులు చేసిన కృత్రిమ విప్లవమే ఆచారమైంది. దురాచారాలన్నీ

ఇలాంటి పనికిమాలిన విప్లవాలే. ఒక విధంగా ఇవి అభివృద్ధి నిరోధకమైనవి ప్రపంచంలోని యితరమతాలు బహిష్టు స్త్రీని మనలా వెలివేయకపోయినా, ఆ సమయంలో సంప్రయోగాన్ని మాత్రం నిషేధించాయి. ఆటవికజాతులన్నీ, ప్రపంచమంతటా ఈ పనే చేశాయి. బహిష్టు ప్రపంచ స్త్రీ సామాన్యమైనది గనుకనే ప్రపంచంలోని ఆటవిక జాతులన్నీ ఒకే నిర్ణయానికి రాగలిగాయి, ఒకే విధమైన ఆటవిక మనస్తత్వమే యిందులో నిబిడీభూతమై ఉంది.

మత ప్రభావం లేని వ్యవసాయ జాతులలోనూ, మత సంప్రదాయాలను త్రెంచుకున్న నాగరిక జాతులోనూ దీనికి భిన్నమైన వైఖరిఉండటం గమనార్హం, మతవిశ్వాసాలను యెదుర్కొన్న పాషండులు, నాస్తికులు, జననాంగాలను సుందరంగాను, ఆనందదాయకాలుగానూ భావించారు. అజంతా భువనేశ్వర్ శిల్పాలలో వారు జననాంగాలకిచ్చిన ప్రాధాన్యత, వాటిని మరీ పెద్దగా చెక్కడంలోనే కనిపిస్తుంది. కాని ఆధునికుల వైఖరి అలా లేదు. గ్రీకుల శిల్పాలలోనూ, ఇటీవల వారి శిల్పాలలోను జననాంగాలు మరుగున పడిపోవటమో, క్షీణదశలో ఉండటమో కనిపిస్తుంది. అలాగే పురుష చిహ్నమైన గెడ్డం ప్రాచీన శిల్పాలలో బొద్దుగా వుండే తరువాత శిల్పాలలో అసలు లేకుండానే పోయింది.

ప్రకృతి సహజమైన వాటికన్నా కృత్రిమంగా మానవకల్పితమైనవి గొప్పవన్న భావం మన సంస్కృతిలోకి ప్రవేశించింది.

బట్ట కట్టడం విషయం గూడ అంతే! పుట్టినప్పుడూ లేదుచచ్చినప్పుడూలేదు. మధ్య ఈ బట్ట దేనికని యోగి వేమన్న గోల పెట్టాడు. మొదట్లో అంగవస్త్రంగా ఉన్న బట్టయే గోచీ ప్రమాణం నుంచి తానులు తానులు చాలనంతగా వళ్ళంతా చుట్టుకొనడం చూడండి; యిప్పుడు ఎంత బట్టకడితే అంత గొప్ప.

అలాగే బహిష్టు విషయంలో కూడా! మొదట్లో బహిష్టు సమయంలోనే సంప్రయోగాని కిచ్చగించిన స్త్రీ కాలక్రమేణా అదే తన ప్రత్యేకతగా భావించి ఆ సమయంలో పురుషుణ్ణి చేరనివ్వకుండా ఉండటమే "గొప్ప"

గా భావించి ఉంటుంది. అదే కాలక్రమేణా ఒక ఆచారమైపోయివుండాలి. నాగరిక జాతి స్త్రీలు ఆ సమయంలో సంప్రయోగం అసహ్యాకరంగా ఉంటుందన్న అభిప్రాయం పడి అదేఆచారాన్ని పాటిస్తూ ఉండవచ్చును.

ఇది మన సంస్కృతి పరిణామం. అయినంతలో బహిష్టుకీ స్త్రీల కామేచ్ఛకి సంబంధం లేదనుకోకూడదు. బహిష్టు సమయంలోనే స్త్రీలకు ఎద ఉండేదన్న సత్యాన్ని మన సంస్కృతి సవాలు చేయలేదు.

ఒకవిధంగా మనుష్య స్త్రీలోనే ఈ ఎద బహిష్టు రూపంలో ప్రజ్వలంగా కనిపిస్తుందని చెప్పుకోవచ్చును. పురుషుడికి సైతం ఎద ఉండేది. అది కాలక్రమేణా నశించిపోయింది.

స్త్రీ సహజమైన కామేచ్ఛ మహాపాపంగా పరిగణింపబడటంవల్లనూ అది ఋతుకాలంలోనే (అనగా బహిష్టు సమయంలో) వ్యక్తం కావటంవల్లనూ అట్టి కామేచ్ఛను అణచివేయటం కోసమే బహిష్టు సమయంలో స్త్రీని వెలివేయటం జరిగిందని అనుకోవాలి.

**● కోతులు కూడా బహిష్టవుతాయన్నారుగదా! అవి బహిష్టు కాలంలోనే సంగమిస్తాయని చెప్పటానికి దగ్గ ఆధారాలున్నాయా?**

లేవు. కోతులకు సంవత్సరాని కొకసారే సంతానం కనే కాలం ఉంటుంది. అవి కొంతవరకూ జంతుప్రవృత్తినీ, కొంతవరకూ మనుష్య ప్రవృత్తినీ కలిగి వున్నాయి. మనుష్యుల్లా రజస్వల అయినప్పటికీ వాటికి "ఎద" సంవత్సరాని కొకసారే కలుగుతుందని జ్ఞాపకముంచుకోండి. కాని, మనుష్య స్త్రీలకు మాత్రం ఈ ఎద ప్రత్యేకం లేదు.

**● ప్రాచీన భారతీయ వైద్య గ్రంథంలో ఆనాటి స్త్రీలు ఋతువులందే కామాసక్తులయ్యే వారని చెప్పడానికి ఆధారాలు ఉన్నాయా?**

మొట్ట మొదటి వైద్యశాస్త్రజ్ఞుడు శుశ్రుతుడు. స్త్రీలే ఎక్కువగా పురుషులపై ఎగబడటానికి బహిష్టు ప్రేరణే కారణమని ఆయన వ్రాశాడు. అది బహిష్టు లక్షణమని ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

చిరాకు, కోపం, మానసిక అస్థిరత్వం మున్నగునవి కామోద్రేకంతో

బాటు మేళవింపబడి బహిష్టు స్త్రీలలో కనిపిస్తాయి. కనుక ఏది యేదో చెప్పలేం, ద్వేషం, సిగ్గు, రౌద్రం, కామం, ఇవన్నీ మూర్తీభవించి ఒళ్ళు తెలియని ఆవేశంలో హత్యలు చేసిన స్త్రీలు లేకపోలేదు. "ఎద" పుట్టిన సమయంలో ఈ విధమైన మదనతాపంవలననే ఆడజంతువులన్నీ చాల క్రూరంగా, కోపంగా వుండటం గమనార్హం

ఋతుస్రావం ప్రారంభమైన మొదటి రెండురోజుల్లోనూ స్త్రీలలో కామోద్రేకం అధికంగా ఉండదు. ఇక రెండు మూడు రోజుల్లో స్త్రీలలోబహిష్టు ప్రారంభం అవుతుందనగానూ, స్రావం ప్రారంభించిన తరువాత మూడవ రోజునా తర్వాత వరుసగా 4,5,6, రోజులలోనూ యెక్కువగా ఉంటుంది.

స్రావం ప్రారంభంకాగానే శరీరంలోని జీవాణువులన్నీ కృంగుతాయి. కనుక ఆవేశస్థితి కూడా కృంగుతుంది. ఆ తర్వాత గర్భాశయంలో రక్తం ఒత్తిడి వలన ఆవేశస్థితి హెచ్చుతుంది. ఈ సంగతి చాలామంది స్త్రీలను వాకబుచేసి తేల్చుకున్నాము. కొందరు స్త్రీలకు బహిష్టు సమయంలోనే కామోద్రేకం ఎక్కువగా ఉన్నట్లు తేలింది. "నాకు బహిష్టు ముందు, అనంతరమే కాకుండా ఆ సమయంలో కూడా ఉద్రేకం ఎక్కువగా ఉంటుంది. కాని ఆ సమయంలో నా కోరికలు తీరడం సాధ్యం కాదుగదా!" అని ఒకావిడ వ్రాసింది.

మరొక సోదరి వయస్సు 19 సంవత్సరాలు. నియమ నిష్టలతో కఠిన బ్రహ్మచర్యాన్ని సాగిస్తున్నది. ఆమెకు బహిష్టు సమయంలోనే తాపం యెక్కువగా ఉంటుందని చెప్పింది. ఆ సమయంలో శరీరంక్షోభించి పోతుందనీ, ఎంతకి నిద్ర పట్టదనీ అంది. ఇది బహిష్టు దోషమే అని ఆమె నమ్మకం.

--(ఎల్లిస్)

**●పోనీ తమకు కామేచ్ఛ ఎక్కువ ఉంటుందన్న సత్యాన్ని గుర్తించారా?**

తమ మనస్తత్వాన్ని తాము తీరికగా విమర్శించి చూచుకునేస్థైర్యం స్త్రీలకు లేదు. అదీగాక, కొందరికీ తమ కామేచ్ఛ అర్థమైనా సంప్రయోగం

ఆ సమయంలో నిషేధింపబడటంవల్ల ఆ అభిప్రాయాన్ని బలాత్కారంగా మనస్సులోంచి బైటకు తరిమివేస్తారు. ఆ సమయంలో కామానుభూతు లెక్కువగా వున్నా సంప్రయోగానికి ఇష్టపడకపోవటం సంప్రదాయసిద్ధమైన నిషేధాలవల్లనేగాని, లోపలలేక కాదు. అందుకే మతిస్థిమితం తప్పిన స్త్రీలకు బహిష్టు సమయంలో కామేచ్ఛ అధికంగా కనిపిస్తుంది.

**● అయితే బహిష్టయిన స్త్రీతో సంప్రయోగానికి పురుషులైనా ఎందుకు అంగీకరించరు?**

బహిష్టు స్త్రీతో సంపర్కం చేసినట్లయితే పురుషుడికి ఆయుషు క్షీణిస్తుందన్న నమ్మకం వుంది. అది మొదటిది, రెండవది ఆ సమయంలో సంప్రయోగం చాలా జుగుప్సాకరంగా ఉంటుంది. మూడవది ఆ సమయంలో భార్య గర్భవతి అయితే కుష్ఠురోగులు, వికృతాంగులు పుడతారన్న నమ్మకం విశ్వవ్యాప్తంగా ఉంది.

ఈ విశ్వాసాలే బహిష్టు స్త్రీతో సంపర్కానికి పురుషుణ్ణి విముఖుణ్ణి చేశాయి. ఏదివిమైనా బహిష్టు ముందూ బహిష్టు ముగిసిన వెంటనే కామేచ్ఛ కలగని స్త్రీకి అనారోగ్యం ఉన్నదనే చెప్పాలి. అంతే కానీ ఆమె ఆరోగ్యవంతురాలనుకోకూడదు.



# ఎద

● స్త్రీలకు వలెనే పురుషులకు నెలనెలా కామోద్రేకం ఉధృతంగా కలిగే ఋతుచక్రం ఉంటుందా?

పురుషులకు కూడా స్త్రీలకువలెనే నెలనెలా నియమితకాలంలో కామోద్రేకం ఉధృతంగా కలిగే స్వభావం ఉన్నదనీ, అది కూడా స్త్రీలఋతు చక్రం వంటిదేననీ పరిశీలకులు భావిస్తున్నారు. కాని, తగినంత సాక్ష్యం లభించటంలేదు. పురుషులు సూర్యాది గ్రహచారం (గ్రహములకదలిక) గురించి ఆలోచించినంత తీవ్రంగా తమ ఋతుచక్రాన్ని ఆలోచించక పోవటంవల్ల ఈ విషయమై యింతవరకూ సిద్ధాంతీకరణ జర గలేదు.

"శరీర వ్యవస్థలో చిత్రమైన పరిణామాలు నెలనెలా ఒకే క్రమంలో కనిపిస్తున్నాయి. ఒక విధమైన ఋతుచక్రం ప్రతీ శరీరంలోనూ వుంది. దీనిని గమనిస్తే గాని, రోగనిదానమూ చికిత్సా పరిపూర్ణంకావు" అని అర్ధశతాబ్ధం క్రితం "లెకాక్" అనే ఆయన తొలిసారి వ్రాశాడు. అయితే ఈ ఋతుచక్ర రహస్యం మాత్రం సులువుగా గ్రహించటానికి వీల్లేనిది. కనుక అట్టి ఋతుచక్రం ఉన్నట్లు ముందు రుజువవ్వాలి, ఆ రుజువుల్నే ప్రస్తుతం సేకరిద్దాం.

● నెలనెలా పురుష శరీరం బరువులో క్రమబద్ధమైన మార్పులేవన్నా వస్తాయా?

ఒక ఇటాలియన్ శాస్త్రజ్ఞుడు ఈ విషయమై పరిశోధన చేసి నెలనెలా నియమితకాలంలో పురుషులు ఒకటి రెండు పౌన్లు బరువెక్కు వవుతారని అన్నాడు. ఆ రోజుల్లో వారికి వళ్ళు భారంగా ఉంటుంది.

వల్లమాలిన నీరసంగా ఉంటుంది.

అందులోనూ నరాల వ్యాధులు గలవారికి మరీ స్పష్టమైన మార్పులు కనిపిస్తాయి. వారి శరీరం చల్లబడుతుంది. ఊపిరి బరువెక్కుతుంది. జీర్ణం కష్టమౌతుంది. తరచు మూత్రం విసర్జించవలసి వస్తుంది. అప్పుడు కొంత యిబ్బందిగా ఉంటుంది. చిరాకుకలుగుతుంది. ఆలోచనలు సరిగారావు. విచారంగా ఉంటుంది. బుద్ధి మందకొడిగా ఉంటుంది. మనిషి చిరబుర లాడుతూ ఉంటాడు. ఈ విధంగా బ్రహ్మచారుల చిత్తవృత్తులు నెలనెలా ఒకే విధంగా వున్నట్టు పరిశీలించటం జరిగింది. పైగా ఈ మనస్థితి సుమారు మూడున్నరరోజులవరకూ ఒకేలా ఉంటుందని పరిశోధకులంటున్నారు.

**● స్త్రీల శరీరోష్ణోగ్రత బట్టిని ఋతుచక్రాన్ని నిర్ణయించినట్లే పురుషుల శరీరోష్ణోగ్రతను బట్టి నిర్ణయించవచ్చునా?**

డాక్టర్ కేంప్‌బెల్ క్లార్క్ ఈ విషయమై పరిశోధన జరిపి నెలకు మూడు రోజులు శరీరోష్ణోగ్రత ఎక్కువగా ఉంటుందని అన్నాడు.

**● స్త్రీలలోవలెనే పురుషులలో ఋతుస్రావం ఉంటుందా?**

స్త్రీలలో వలెనే పురుషులలో స్పష్టంగా ఋతుస్రావం ఉన్నట్లు చెప్పలేము. కాని, అతని మూత్రంలో మటుక్కు ఆ మూడు నాలుగు రోజులూ తెల్లకణాలు ఎక్కువగా పోతాయి. స్త్రీ ఋతుస్రావంలో తెల్లకణాలు ఎక్కువగా పోతాయని గ్రహించండి. కొందరికిదే కాలంలో తలనొప్పి, ముక్కుమ్మట రక్తం కారటం, రక్తగ్రహిణి, మూత్రంలో యూరిక్ ఆసిడ్ సమృద్ధిగా ఉండటం వంటివి కనిపిస్తాయి.

దీనిని బట్టి ఋతుచక్రం స్త్రీలకేగాక పురుషులకు కూడా ఉంటుందనీ, పుట్టినప్పటినుంచీ గిట్టేవరకూ ప్రతీమనిషికీ ఇది తప్పదని చెప్పుకోవచ్చు. స్త్రీలకు అంగికంగా రజస్వలతో వెల్లడై ముట్లుడగటంతో అంతర్గతమవుతుంది. పురుషునిలో యావజ్జీవితం అంతర్గతంగానే ఉంటుంది.

**● రజస్వలకాని కన్యలకూ, ముట్లుడిగిన స్త్రీలకూ ఈ ఋతుచక్రం**

ఏ రూపంలో కనిపిస్తుంది.

పురుషులకు చిత్తవృత్తిలోని మార్పులద్వారా పైనవర్ణించిన విధంగా ఎలా కనిపిస్తున్నదో అదే విధంగా చిరాకు, కోపము అలసట వంటి మానసిక వికారాలద్వారా రజస్వలకాని కన్యలలోను ముట్లుడిగిన ముగుదలలోనూ కనిపిస్తుంది.

**● గర్భిణీ స్త్రీలు బహిష్టుకారుగదా! వారికి కూడా యిదే విధంగా కనిపిస్తుందా?**

అవును. ఋతుస్రావం లేనంతమాత్రాన ఋతులక్షణాలు ఉండవను కోరాదు. నడుమునొప్పి, తలనొప్పి, చిరాకు, కోపతాపాలు యధావిధంగా కలుగుతాయి.

ఏ లక్షణాలైతే రజస్వలకాని కన్యలకు, ముట్లుడిగిన స్త్రీలకు, గర్భిణీ స్త్రీలకు సర్వసామాన్యంగా నెలనెలా బహిష్టుకాలంలో కనిపిస్తున్నాయో అవే లక్షణాలు పురుషులకు కూడా నెలనెలా ఒకే కాలంలో కనబడటాన్ని బట్టి పురుషులందు కూడా ఋతుచక్రం ఉన్నదని తేలుతున్నది.

**● స్త్రీలకు ముట్లు ఎగిస్తాయంటారు. అలాంటివి పురుషులకు కూడా ఉంటాయా?**

రజస్రావాన్నే ముట్టు అంటాము. ముట్లెగించినట్లుపైకి కనబడినా ఏ శారీరక మానసిక మార్పులైతే స్త్రీలకు నెలనెలా కనబడుతున్నాయో అవి ముట్లెగించినా, ఎగించవు. ఇక ఎగింపుగా కనబడే రజస్రావం మాత్రం పురుషులకు ఎప్పుడూ ఉండదుగదా! కనుక పురుషులకుఎప్పుడూ ముట్లు ఎగించే ఉంటాయి. గనుక స్త్రీలకువలే ప్రత్యేకంగా ఎగించటం అంటూ ఉండదు.

**● పురుషులలో ఆ సమయమందు "కామోద్రేకం" అధికంగా వుంటుందా?**

ఈ విషయమై పరిశోధకులెవరూ అంత పట్టింపుగా పరిశోధనలు జరిపినట్టు కనబడదు. అయినా కొందరు పురుషులలో కామోద్రేకం

నాల్గువారాలకొకసారి వృధృతంగా కనిపిస్తుందని చెప్పకపోలేదు. ఇలా నడుము నొప్పి, తలనొప్పి, బద్ధకమూ, కలిసిన బ్రహ్మచారులకు ఈ కాలంలో స్వప్నస్కలనాలు విధిగా కలుగుతాయని వారన్నారు. పొటాసియం బ్రోమైడుగాని, పొటాసియమ్ అయిడయిడ్‌గాని తీసుకున్నట్లయితే ఈ వుధృతం తగ్గుతుంది. ఆ తర్వాత వారందరకూ చాల నీర్సంగా ఉంటుందని ఒక పరిశోధకుడు వ్రాశాడు. కొందరు పురుషుల రొమ్ములు కొద్దిగా ఉబ్బుతాయి కూడా, ఆ కాలం దాటిపోగానే మళ్ళీ యధాస్థితికి వస్తాయి

ఏమైనా పిచ్చివాళ్ళల్లోనూ, నరాల దౌర్బల్యంగల వాళ్ళల్లోనూ ఈ పరిణామం ఉగ్రంగా కనిపిస్తుంది. సహజ ఆరోగ్యంగల వాళ్ళల్లోనూగృహస్తులోనూ అంత స్పష్టంగా కనబడదు. కారణమేమంటే నరాలవ్యాధులు గల వాళ్ళలోనూ పిచ్చివాళ్ళలోనూ మానసిక నిరోధాలేవీ ఉండవు గనుక.

**● గృహస్థులో విస్పష్టంగా కనబడకపోవటానికి కారణమేమిటి?**

గృహస్థులలో కామం ఎప్పటికప్పుడు చల్లారుతూ ఉంటుంది. గనుక ప్రత్యేకంగా ప్రకోపించదు. పైగా వారికి నిరోధాలెక్కువ. మనస్సు యెల్లప్పుడూ ఏదో విషయంపై చురుకుగా పనిచేస్తూ ఉంటుంది. అందువలన గృహస్థులలో ఈ లక్షణాలు అంత స్పష్టంగా కనబడకపోవచ్చు.

అయితే వీరిలో ఎక్కువగా వారం వారం ఒకసారి– ముఖ్యంగా శని, ఆదివారాలలో కామోద్రేకం ప్రస్ఫుటమవుతుంది. నాడివేగం, శరీరోష్ణోగ్రత ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగం లోనూ; శరీరం బరువు, యూరియా, కార్బోనిక్ ఆసిడ్ మున్నగు వాటి రాశిలోనూ ఈ రెండు రోజులలో భేదం కనిపిస్తుందని పరిశీలకులు తేల్చారు.

ఏమైనప్పటికీ ఇలాంటి ఋతుచక్రం పురుషులలో ఉండటానికి అవకాశం ఉందనే ప్రస్తుతం మనం నిర్ణయించుకోవచ్చును. చాలా మంది పరిశోధకులు తమ జీవితకాలం కృషిని చేస్తేగాని పూర్తిగా నిర్ధారించి చెప్పటం మంచిది కాదు.

ఏటేటా నియమితకాలంలో వసంతం వంటి ఋతువులను బట్టి

మానవశరీరంలో మార్పులు యేర్పడుతూ ఉంటాయని శరీర శాస్త్రిజ్ఞు లందరూ అంగీకరించారు. ముఖ్యంగా గర్భధారణకి చెట్లు చిగిర్చే చైత్ర మాసంలో యే వివాహిత స్త్రీ అయినా పుట్టింట ఉండరాదన్న నిషేధాన్ని కూడా పెట్టాయి.

దీనినే కవులు కూడా గుర్తించి వసంత వర్ణన వసంతంలో వచ్చే సంగీత వర్ణన–వీటితో తమ ప్రబంధాలను నింపివేశారు. ఉత్తరాది సాంప్రదాయాలకివి అనుగుణంగా ఉన్నాయి.

పాశ్చాత్యులు కూడా యిదే అభిప్రాయాన్ని కలిగివున్నారు. "తొలకరిలో స్త్రీ శరీరంలోని సమస్తాంగాలు సంపూర్ణ జవసత్వాలతో ఉంటాయి. పరిపూర్ణంగా వికసించి వుంటాయి. కనుక తమ విధుల్నికూడా సంపూర్ణంగా నిర్వర్తించగలవు" అంటూ ఎడ్వర్డ్ స్మిత్ (1861) వ్రాశాడు.

"మానవ వివాహాల చరిత్ర" అన్న గ్రంథంలో వెస్టర్ మార్క్ అనాటి జాతుల స్వభావం గురించి చెబుతూ చైత్రమూ, తొలకరీ కామవృద్ధినికలిగిస్తాయన్నాడు. అప్పుడే స్త్రీలు గర్భవంతులవటం యెక్కువగాజరుగుతుందన్నాడు. జనన మరణాల లెఖలు తీసుకుంటే ఈ విషయంరుజువవుతుంది.

మరో ముఖ్య విషయం వుంది. చాలా జంతువులు ఒకటి రెండు సార్లు మాత్రమే ఏటేటా పొర్లటం జరుగుతుంది. ఆహారం సమృద్ధిగా దొరికే రోజులలోనే అవి బిడ్డల్ని కంటాయి. ఇతర కాలాల్లో ఆడజంతువులు గర్భధారణ శక్తిని కలిగి వుండవు. వాటికి కామవాంఛ కూడా ఉండదు. మగజంతువులకు అనుకూలంగా కామాసక్తమై ఉండటం గమనించదగ్గది.

అడవి కుక్కలు చిత్తకార్తిలో కలుస్తాయి. సంవత్సరాని కొకసారి నియమితమైన కార్తిలోనే వీటికీ కామాసక్తత కలుగుతున్నది. పెంపుడు కుక్కలకలా కాదు. చిత్తకార్తి తర్వాత మరో ఆరు నెలలకు తిరిగి అవి పొర్లుతాయి. కాని, చిత్తకార్తిలో పొర్లినప్పుడు పుట్టినంత బలమైన కుక్క పిల్లలు రెండవసారి పుట్టకపోవటం గమనించండి.

గుర్రాలు, గొర్రెలు తొలకరిలోనే పొర్లుతాయి. కోతులు ఏటికేడాది

బహిష్టవుతూ, కలుస్తూవున్నా తొలకరిలోనే గర్భం ధరిస్తాయి. బిడ్డలకుతగి నంత ఆహారం సమృద్ధిగా దొరికే (ఆర్థికావసరాలు) కాలంలోనే అవి బిడ్డల్ని కంటాయంటే ఈ సృష్టివైచిత్రి అర్థమవుతుంది. ప్రాణికోటి ఆర్థికా వసరాలను కనిపెట్టే ఈ సృష్టిని భగవంతుడు నియమించాడా అనిపిస్తుంది. భగవంతుని సృష్టిలోనే కుటుంబనియంత్రణ నిబిడీభూత మైనట్లు కనిపించకమానదు. చెట్లు చిగిర్చే తొలకరిలోనే జంతుకోటి గర్భాన్ని ధరించి పంటలుపండే కాలంనాటికి బిడ్డల్ని పెట్టే క్రమం కేవలం భగవంతుని విలాసం కాకపోతే యేయిటి? అందుకు తగ్గట్టుగా స్త్రీపురుష జంతువులకు శక్తి సామర్థ్యాలు తొలకరిలోనే విజృంభించాలి!

**● ఆడది గర్భాన్ని ధరించి వుండగా జంతువులు ఏవైనా సంప్రయోగం చేస్తాయా?**

పక్షులు సరీసృపాలు, జంతువులు ఏవీ ఏ పరిస్థితులనూ ఆడది గర్భాన్ని ధరించి ఉండగా కలియవు. నరుడూ, వానరుడూ యీ యిద్దరే అలా కలిసే జంతువులు.

**● ఉష్ణదేశాల ప్రజలు ఏటి పొడవునా సంప్రయోగం జరువుతూనే ఉంటారు గదా... తొలకరికాలం గాక యితర కాలాలలో కూడా వారు గర్భాన్ని ధరించటం జరగదా?**

నరుడూ వానరుడూ కాలనియమం లేకుండా సంవత్సరం పొడ వునా సంప్రయోగం చేస్తూ వుంటారన్న మాట నిజమే. కాని వానరులుఅనియ మితకాలంలో గర్భాన్ని ధరించవు. నరులు ధరిస్తారు. కాని చాలాసకృత్తు. తొలకరిలో ధరించేటంత అధిక సంఖ్యలో ధరించరు. యెలాగైనా సృష్టిపై తిరుగుబాటు చేసే స్వభావమే మానవుడిదిగదా, ఆహారాన్ని నిలవ చేసుకోవటం నేర్చిన జంతువు మానవుడు!

**● సంవత్సరంలో ఒకే ఋతువులోనే గర్భాన్ని ధరించటమూ తిరిగి, ఆ ఋతువులోనే కలియటం యితర ఋతువుల్లో సంప్రయోగమూ గర్భధారణాలేని మానవజాతులు ఉన్నాయా?**

ఉన్నాయి. డాక్టర్ కూక్ ఎస్కిమో జాతి జీవితాన్ని పరిశోధించి ఈ సత్యాన్ని తేల్చాడు. ఉత్తరధృవ ప్రాంతంలో సంవత్సరం పొడవునామంచు గడ్డ కట్టుకొని ఉంటుంది. ఫలితంగా మానవ కండరశక్తి దుర్బలమవుతుంది. పురుష శరీరంలో వీర్యం గడ్డకట్టుకుపోతుంది. వీర్యోత్పత్తే ఉండదు. స్త్రీలకు నెలనెలా బహిష్టులు ఉండవు. సంవత్సరానికి ఈ జాతి స్త్రీలు వొకటి రెండుసార్లు బహిష్టవుతారు. అనగా వారిలో అండవిసర్జన ఒకటి రెండుసార్లే జరుగుతుంది.

సూర్యదర్శనం కావటంతోనే పరిస్థితిలు తారుమారవుతాయి. కామోద్రేకం విశృంఖలంగా విజృంభిస్తుంది. మదనతాపంతో స్త్రీ పురుషులు గజగజ వణికిపోతారు. ఆ నాలుగయిదు వారాలు ఉభయులూ ప్రణయ క్రీడల్లో కామకేళిలో నిమగ్నమవుతారు. యించుమించు "చిత్తకార్తె". ఎక్కడ చూసినా జోడీ జోడీలుగా కనిపిస్తారు. ఇట్లా పరిమితకాలానికి వశమయి (కార్తె) కామోద్రేకాన్ని పొందటాన్నే "ఎద" (Rut) అంటారు.

ఈ రోజులలోనే హత్యలు కూడా ఎక్కువ జరుగుతాయి. తమ కామోద్రేకాన్ని స్త్రీలు నిరోధించినట్టయితే బాధ భరించలేక హత్యలు చేసి వేస్తారు. పులులూ, తోడేళ్లు యిదే విధంగా ప్రవర్తిస్తాయి.

బహుశా అందుకే సూర్యుడు మనకి ప్రాణదాయక దేవతగా కనిపించి నమస్కరిస్తున్నాము.

కాంబోడియాలో సంవత్సరానికి రెండుసార్లు (తొలకరి, వర్షర్తువు) ఈ ఎద వస్తుంది. ఇతర కాలాల్లో వాళ్ళు కలియరు.

సమస్త జాతుల పర్వదినాలన్నీ విత్తనాలు నాటే కాలంలోనూ పంటలు కోసే కాలంలోనూ రావటాన్ని బట్టి సమస్తజాతుల ప్రజలూ ఆయా మాసాలకిచ్చిన ప్రాధాన్యత గమనించదగ్గది. మనకు సంక్రాంతి నుంచి సంవత్సరాది వరకూ పండుగలొస్తాయి. ఆ తర్వాత కార్తీకమాసంలో వనసంతర్పణలు చేస్తాము. అదంతా మన సమృద్ధిని తెలియజేయటానికే!!

**• వీటిల్లో కామప్రవృత్తిని చూపించే పండుగలేవీ లేవా?**

చాలా ఉండేవి. రెండువేల సంవత్సరాల క్రితం యే పండుగలు చేసుకునేవారో వాత్స్యాయన కామసూత్రాలలో చెప్పాము. అవన్నీ మన్మధ పూజకు ఉద్దేశింపబడినవే. హెూళీ పండుగ యింకా ఉత్తరాదిలో ఉంది. వసంతోత్సవాలను దక్షిణాత్యులు మరచిపోయారు. మన్మధపూజలకు ప్రత్యేకం కొన్ని రోజులున్నాయి. సుప్రసిద్ధ శివలింగపూజ ఈ రోజుల్లోనే జరుగుతుంది.

విత్తనాలు నాటేకాలంలో శృంగార పదాలు పాడుతూ తెనుగుపడుచులింకా వ్యవసాయపు పనులకు పోతూనే వుంటారు. "ఏరువాక" తొలిరోజులు స్త్రీ పురుషులంతా ఆదమరచి వెన్నెట్లో అల్లరిచేసే ఆచారం ఇంకా వుంది.

ఆస్ట్రేలియాలో "కారూ" అనే పండుగ శరత్ పున్నమినాడు జరుపుతారు. ఆ వెన్నెల్లో నృత్యం చేస్తూ ఈటెలతో పొదలను పొడవటం వారికి సరదా. పురుషాంగానికీ, నాగలికీ ఈటె సంకేతమట! భూమికీ, యోనికీ పొదలు సంకేతమట!

"మాఘ్‌ఫారా" అనే పండుగ బెంగాల్‌లోని జాతులవాళ్ళకి జనవరి నెలలో వస్తుంది. మాఘ పున్నమిరోజున, వావివరసలనూ, సాంఘిక నియమాలనూ విడిచి, వెన్నెట్లో స్వేచ్ఛగా ఆటపాటలతో గడిపి, కామక్రీడలతో ఆనందిస్తారు.

ఆ రోజు ఉదయమే పురోహితుడు వచ్చి మంత్రాలను చదువుతాడు చనిపోయిన పెద్దల్ని స్మరిస్తారు. యింద్రుని, వరుణునీ ప్రార్థిస్తారు. ఆ వేళ బియ్యపు కడుగుతోచేసిన సారా త్రాగి స్త్రీ పురుషులంతా వళ్ళు తెలియకుండా గెంతి, కామానుభవం పొందుతారు. సంవత్సరం పొడవునా వారిలో చేరుకుంటున్న యవ్వనశ్రీ పొంగి పరవళ్ళు త్రొక్కుతున్నదనీ, కనుక దానికీ రోజున గండికొట్టడం అవసరమనీ వారి విశ్వాసం. యితర రోజులలో ఈ కొండజాతి వారంత నమ్రతగలవారు లేరు.

సామాన్యమైన రోజులలో యెంతో మర్యాదగా పరిమితంగా మాటాడే స్త్రీలు, అసభ్యతంటే యేమిటో తెలియ దనిపించుకునే ఈ స్త్రీలు, తీరా

ఆ మాఘపున్నమిరోజున కర్ణకఠోరమైన బూతులు మాట్లాడుతూ, బూతు పనుల్ని బహిరంగంగా జరిపిస్తూ ప్రవర్తించటం ఆశ్చర్యం కదా? ఆడ పిల్లలూ, మగపిల్లలు కూడా తల్లిదండ్రుల్ని తిడతారు. అలాగే తల్లిదండ్రులు కూడా పిల్లల్ని తిడతారు. ఒక హద్దూ అపూ లేకుండా ఆ జాతి యువతీ యువకులు, పట్టపగలు పెద్దల కళ్ళముందు చేసే సాముహిక వ్యభిచారం ఆనాటితో సరి. మర్నాటి నుంచి అందరూ బుద్ధిమంతులేకాని అనాటి సంబంధాలే మర్నాటి నుంచి వివాహాలుగా పరిణమిస్తాయి.

(డాల్టన్)

బర్మాలో బుద్ధపూర్ణిమ, రోమ్‌లో సాటర్నేలియా; ఐరోపాలో ఈస్టర్ ఇలాంటి పండుగలే. ఈ విధమైన కామపూజలన్నీ ఉత్తర దక్షిణాయనాలు ప్రారంభమైన తొలిరోజులలోనే జరగటం గమనించదగ్గది. యీ అనాది ఆచారావశేషాలు యింకా ప్రపంచంలో చాలా చోట్ల ఉన్నాయి.

స్త్రీలు గర్భవతులవటానికి మే జూన్ మాసాలు చాలా అనుకూల మని శిశుజననాల సంఖ్యనుబట్టి తెలుస్తుంది. శిశు మరణాల సంఖ్యనుబట్టి ఇతర మాసాలలో కడుపుసబడ్డవారే ఎక్కువ దుర్బలులని ఫలితంగా వారే ఎక్కువ మంది మరణించటం జరిగిందని తేలింది.

దీని సారాంశమేమంటే స్థూలంగా సంవత్సరానికి ఒకసారి ఎస్కి మోజాతులవంటి శీతల ప్రాంతాల్లో ప్రజలకు; స్కాండినేవియా వంటి ప్రాం తాల ప్రజలకు సంవత్సరానికి రెండుసార్లు ఎద కలుగుతుందని చెప్పు కోవచ్చు. స్కాండినేవియావంటి దేశాల స్త్రీలు సంవత్సరానికి రెండుసార్లు బహిష్ట పటం గమనించదగ్గది. మనదేశం వంటి ఉష్ణమండలపు స్త్రీలు సంవత్సరానికి 12 నుండి 14 సార్లు బహిష్టవుతు న్నారంటే వారిలో ఎదల సంఖ్య పెరిగిందనే చెప్పుకోవాలి.

సృష్టికీ, సూర్యునికీ ప్రత్యక్ష సంబంధం ఉన్నదిగదా! ప్రాచీన ఋషులు, శుశృతుడు వర్ణించిన ఋతుకాలన్నీ ఈ "ఎద" సమయాలే అనుకుంటే మన సమస్య చాలావరకూ తీరినట్లే.

**● స్వప్నస్కలనాన్ని బట్టి ఏ కాలంలో పురుషులకు కామోద్ధృతం ఉంటుందో చెప్పుకోవచ్చునా?**

స్వప్నస్కలనాల సంఖ్యనుబట్టి పురుషుల కామోద్ధృతకాలాన్ని నిర్ణయించవచ్చును. మే, జూన్ నెలలో బ్రహ్మచారులకు స్వప్నస్కలనాలెక్కువ. దీనిని బట్టి వారికి ఈ కాలంలో ఎద ఎక్కువగా ఉంటుందని చెప్పుకోవచ్చును.

**● ఇలా కామం ఋతువును ఆశ్రయించి ఉండటానికి కారణమేమిటి?**

తొలకరివలన, ఆషాఢ మేఘాలవల్లనేమి, స్త్రీ పురుషుల శరీర తత్వంలో ప్రముఖమైన మార్పులకారణంగా ఆయాకాలాలలో వారికికామోద్రేకం ఎక్కువవుతుంది. ఆర్థిక సంపదకై సృజనాత్మక వ్యవసాయాన్ని వారు ప్రారంభిస్తారు. గనుక వారి మానసికోల్లాసం కూడా ఈ కాలంలో ఎక్కువగా ఉంటుంది.

కనుక కామానికీ ఋతువుకీ ప్రత్యక్ష సంబంధం ఉన్నట్లుగా భావించవచ్చును. కాల ప్రభావంవల్లనే వారి ఎద కలుగుతూ ఉంటుంది.



# రాంషా - శిరీష రచనలు

| | | |
|---|---|---|
| 1. | స్వయంతృప్తి | రు. 5.00 |
| 2. | సృష్టి రహస్యం 1వ భాగం | రు. 15.00 |
| 3. | సృష్టి రహస్యం 2వ భాగం | రు. 15.00 |
| 4. | మనో లైంగిక వ్యాధులు | రు. 15.00 |
| 5. | లైంగిక సమస్యలు | రు. 10.00 |
| 6. | రతి రహస్యం | రు. 10.00 |
| 7. | నాగరిక దాంపత్యం | రు. 5.00 |
| 8. | దాంపత్య రహస్యం | రు. 15.00 |
| 9. | ప్రణయకళ | రు. 15.00 |
| 10. | కామశిల్పం | రు. 20.00 |
| 11. | సంతానం 1వ భాగం | రు. 10.00 |
| 12. | సంతానం 2వ భాగం | రు. 10.00 |
| 13. | పిల్లల పెంపకం | రు. 10.00 |
| 14. | శృంగారం | రు. 10.00 |
| 15. | సౌష్టవం | రు. 5.00 |
| 16. | అడగండి చెపుతాను | రు. 3.00 |

| | |
|---|---|
| 17. యోగశాస్త్రం | రు. 3.00 |
| 18. హేతువాదం | రు. 10.00 |
| 19. సాంఖ్యమ్ | రు. 5.00 |
| 20. వైశేషికం | రు. 5.00 |
| 21. రాంషా సుభాషితాలు | రు. 5.00 |
| 22. కామేశ్వరి కథ | రు. 5.00 |
| 23. పెళ్లి తిరకాసు | రు. 5.00 |
| 24. మీనాక్షి ముద్దు | రు. 5.00 |
| 25. మనస్తత్వాలు | రు. 5.00 |
| 26. అనంతం | రు. 5.00 |

## కొత్త పుస్తకాలు

| | |
|---|---|
| కామజిజ్ఞాస | రు. 5 |
| కామప్రవృత్తి | రు. 5 |
| తీయనిబాధ | రు. 5 |
| గర్భధారణ సమస్యలు | రు.10 |